మొదటి కూర్పు
1000 ప్రతులు.		10 అణాలు

# అంకితం

"పేదవారిని ఆదరించే
దాతలే కనుపించరా" అనే ప్రశ్నకు
"నేనున్నాను." అంటూ పేదలకన్నీళ్ళు
అమృత హస్తాలతో తుడిచే
ప్రియమిత్రులు
డాక్టర్. చెన్నకేశవుల రంగారావుగారికి,

ప్రేమతో
చంద్రం



ముద్రణ
ప్రాకీయ సరస్వతీ ప్రెస్,

# ౧

“స్వేచ్ఛ ప్రతిజీవికీ వాంఛనీయమే, ఆనందదాయకమే స్వాతంత్ర్యం కంటే స్వర్గం, బానిసత్వం కంటే నరకం, ఉండవు: ప్రేమకంటే ఆనందం, కామంకంటే దుఃఖం కలుగవు; వెలది వెన్నెలకు చెయిచాచినట్లు, కటికి చీకటికి చెయిచాచే దెవరు?” అవి దేవిభావాలు. దేవి పార్కులో కూర్చుండి చంద్రుని మసక చీకటిలో మాయం చేసే మబ్బుతునకలను చూస్తూంది. “చల్లని వెన్నెలనిచ్చే చంద్రుని తెల్లనికాంతి, నల్లనిచేతులతో నీలి మబ్బులు మాయం చేస్తున్నాయే. ఆనందంగా ఉన్నా వారిని చూస్తే ఎందుకో అసూయ, అబ్బ! అసూయ ఎంత అగాధం. ఎంతగభీరం: ఎంత ఆశానిలయం” నిర్మలమైన ఆమె హృదయం నివురు గప్పిన నిప్పులా కనకసలాడుతూంది. చంద్రుడు మబ్బుమాటయ్యాడు. ఆమె వియోగ హృదయం పరితప్తమయిపోయింది. హృదయం శిథిలమై కనులు కదిలి పోయాయి; భావాలు చెదరి పోయాయి.

“నా కన్నీటితో అనురాగ వల్లరిని పెంచుకున్నాను. ఆశాపుష్పాలు పూయించుకున్నాను. పూలతో ఆడుకున్నాను. పాడుకున్నాను; నవ్వుకున్నాను. అంతే కర్మదేవత ఎక్కడ నుంచి వచ్చిందో తన నల్లని ఇనుప చేతులతో నా ఆశాపుష్పాలను నలిపి వేసింది; నా అనురాగవల్లరిని కూల్చి వేసింది; నా కన్నీళ్ళు రాల్చివేసింది. ఇపుడు నేనూ నేలంట కూల్చబడిన నా అనురాగవల్లరి మిగిలాం. నావంక జాలిగా

చూస్తూన్న జాబిల్లిని కూడా మాయం చేసిందా మాయదారి మబ్బు'

భావనా సముద్రంలో ఒక చిగుత కెరటమై దేవి కదిలి పోతూంది. కదలే కనులతో ఎదుటిగా ఉన్న పోక చెట్టును చూచింది. రసవదాకాశాన్ని చూస్తూ పక్షిదంపతులు పరవశం పొందుతున్నాయి. ముక్కూముక్కూ జతచేర్చి, రెక్కలు నిక్కించి ఆడుకొంటున్నాయి. మూగభాషలో పాడుకొంటున్నాయి. ఆమె హృదయ పాత్రిలో ప్రణయామృతరసం చలచలా మరిగింది. ఆ శకుంతదంపతుల ఆనందాన్ని ఆస్వాదించ లేపోయింది. ఆకాశం వంక చూచింది. చంద్రుడు మబ్బులను తప్పించుకొని పరిగెడుతున్నాడు.

"రా దేవీ! రా! ఈ నిర్మలాకాశంలో ఆడుకుందాం. అలా చూస్తావే దేవీ! ఈ రసవదాకాశం అంతా నాదే. నిన్ను దానికి రాణిని చేస్తాను. నా హృదయ సింహాసనంమీద అధిష్ఠించి, కన్నీటి మంచు ముత్యాలతో ముగ్గులు పెడతాను. వలపుపూలతో మాలల్లి,నీమృదుమధుర గళసీమ నలంకరిస్తాను. మాట్లాడవేం. నాయందనురాగం లేపోతే గులాబీ రేకుల వంటి నీపెదెములపై చిరునవ్వు ముత్యాలు చిలుకరిస్తావా? రా దేవీ! రా! మబ్బులో నేను మాయం కాకముందేరా, పవిత్రమైన కాలం ఆలోచనలలో పాడుచేయక రా—రా"

అతి విశాలమైన ఆకాశం వంక చూడలేపోయింది. ఆమె ప్రతి రక్తనాళం ఉద్రిక్తమై పోయింది. అక్కడొక క్షణం కూడా ఉండలేపోయింది. కొమ్మనుంచి కొమ్మకు పోయే కోకిలలాగ పొదరింటి చెంతనుంచి, మరోపొదరింటి చెంతకు వెళ్ళి

కూర్చుంది. "[illegible] సమ్మోహనంగా, ప్రకృతి ప్రణయ [illegible] వాంఛా పూరితాలు. ఈ ప్రణయ [illegible], ప్రకృతిని, ప్రాణాలను, సృజించిన భగవానుడు [illegible]. కూడా సందేహం లేదు."

చిరు నిట్టూర్పు [illegible] లో చలిగాలి వీచింది, కనులు [illegible] చెక్కిలి గింతపెట్టింది. కోయిల "[illegible]" గానం హృదయం చల్లబడింది, కాలిపోతున్న శరీరాన్ని [illegible] కొలనులో ముంచి తేల్చాడు చంద్రుడు. శరీరం చల్లబడింది. ఆహా! ప్రపంచానికి ప్రకృతి ఎంత చక్కగా తోడ్పడుతుంది. పడుకున్న దేవిభావనతో పాలసముద్రం [illegible] నురగలు కక్కింది. యౌవనప్రవాహం ఎన్ని శిలలను తాకి చీలిపోతూ ఉంటుంది. కామపిశాచం చేతిలో జవ్వని కీలుబొమ్మనా! జవ్వని వేడి నెత్తురు విరాగ శిలపై చల్లబడి పోవలసిందేనా!" ఆమె ప్రశ్నకు జవాబు రాలేదు. రెక్కలు నరకబడిన ఆమె హృదయం రెప రెపా కొట్టుకుంది. చీలిపోయిన గాలిపడగలాగ ఆమె జీవితం చీలిపోయింది. అంతలో ఆకోనను వెళుతున్న ప్రియుడెవరో ఛాయాదేవిని చూచి చిరునవ్వు నవ్వాడు. వింతగా—రోతగా—ఆమె హృదయంలో వేయి వేల చేతులు పెట్టి—వచ్చి నెత్తురు దోసిళ్ళతో తీసి—ప్రపంచ బలిపీఠం మీద పారబోస్తున్నట్లుంది.

*

"ఆమేకదూ దేవి?"

"అవును."

"ఇంకే ప్రియుని కోసం ఎదురు చూస్తుందో!"

"ఒకళ్ళనా—ఇద్దరనా. ఎవరినని చెప్పం"

"పండువంటి కాపురం పాడుచేసుకొని పరాయివాని కోసం పాకులాడుతుందా?"

"రంకులాడికేముంది? భయమా? భక్తా!"

"పోనిదురూ వెధవముండ! దానిసంగతి మన కెందుకు? అటువంటి "కులటల" తలుచుకుంటేనే పాపం,"

* * * *

ఆ దంపతుల సంభాషణ విన్నది. కసాయివాని కత్తి క్రిందున్న మేకపిల్లలా గజగజ లాడిపోయింది. కారేకన్నీటిలో లోకాన్ని వింతగా చూచింది. రంకు 'రాలను—కులటను—పాపిని—" ఆమె నిట్టూర్పు బరువుగా విడిచింది కన్నీరు బలవంతంగా రాల్చింది. "పండువంటి కాపురాన్ని పాడు చేశానా? పరాయి వాళ్ళకోసం పాకులాడు తున్నానా? అవును—అంతానిజమే—నేను కులటనే—పాపినే-ద్రోహినే-కాదని ఎవ రన గలరు? ఎలా అనగలరు?—లోకం నావంక చూసి పకపక నవవ్వుతుంది; నావెనుక గుసగుస లాడుతుంది, ఎందుకు? నేను కులటను కాబట్టే—నేను పాపిని కాబట్టే—నేను కులటనని నిందించేవారే కాని—కులటనెలాగయ్యానో విమర్శించి—నావంటి భగ్న హృదయులకు మార్గం చూపించే వారేరీ? లేరే. ఉంటే పాపభూయిష్ఠమైన ప్రపంచం ఎప్పుడో స్వర్గంఅయ్యేది—"

అంతలో "కొట్టండి దొంగముండా కొడుకును. కొట్టండి నరకండి. చీల్చండి. పోలీసుకుఅప్పగించండి. ఖయిదులో వేయం

చండి. రోగం ముదురుతుంది." అలా వర్షం కురిపించేస్తూ—
పన్నెండేండ్ల కుఱ్ఱవానిని—రొట్టెల బుట్టలో ఒకరొట్టెని దొంగి
లించాడని—కట్టుకొని పెద్దమనుష్యులని పేపర్లలో పొగడ
బడిన మహాశయు లంతా కొడుతున్నారు. దేవిహృదయం
ఉద్రిక్తమై పోయింది. అక్కడ వెళ్ళకుండా ఉండలేపోయింది.
వెళ్ళి—కుఱ్ఱవానిని దగ్గరకు తీసింది.

"ఏంమహాశయుల్లారా! కుఱ్ఱవాణ్ణలాకొడుతున్నారు"

"కొడతామా! నొక్క చీలుస్తాము?"

"ఎందుకు?"

"రొట్టె లమ్ముకొనే వాని రొట్టె దొంగిలిస్తాడా?"

"ఎందుకు దొంగిలించాడండి?"

"ఏమో!"

"కారణం తెలుస్తే ఇలా కొడతారా? నిందిస్తారా?"

"ఏమిటి కారణం?"

"కడుపుమంట-ఆకలి-అన్నాతురుడై మీవంటి భాగ్య
వంతులను ముట్టేస్తూ తే—మీ పవిత్ర హస్తాలతో ఒకదమ్మిడీ
ఇచ్చారూ? దమ్మిడీ ఇవ్వలేని చేతులతోనేనా 'దబదబా'
బాదుతున్నారు? ఆకలి మంట చల్లార్చుకోలేని అభాగ్య జీవికి
అన్నంపెట్టక, రక్తం కారేటట్టు కొడతారా? అందుకేనా
మీ శరీరాలు పెంచుకుంది? అందుకేనా మీ ధనరాసులు
నించుకొంది? ప్రపంచాన్ని ఆహుతిచేసే ఆకలిబాధ తెలుస్తే
మీరిలాచేస్తారూ? మీరిటువంటి స్థితిలో ఉంటే దొంగతనమే
కాదు.హత్యలనుకూడా చెయ్యగలసమర్థులు. వెళ్లండి వెళ్లండి.
కారణం ఊహించకుండా కార్యాన్ని నిందించకండి."

ఆ మాటలు అగ్నిసర్పంలా ప్రసరించి—బాబాని చెయ్యి పట్టుకొని దేవి తీసుకువెళ్ళిపోయింది. కొమ్ములు తిరిగిన మగవాళ్ళంతా క్రూరచూపులు చూశారు. సిగ్గున్నవారు సిగ్గుపడ్డారు.

* * * *

"అమ్మగారూ! మీ మేలెన్నటికీ మరువలేను"

"మేలేముంది బాబూ!"

'యమకింకరులవంటి వారినుంచి తప్పించారు. అంతకంటే?'

"దాని కేమిలే."

"అమ్మగారూ! తల్లీ దండ్రీ లేనివాడను. తోడూ నీడా ఎవ్వరూ లేరు. అక్కడక్కడ ముష్టెత్తుకుంటూ ముష్టి దొరకనప్పుడు దొంగతనంచేస్తూ అతినీచంగా ఇలా నలుగురు నోళ్ళలో పడి బ్రతుకుతున్నాను. ఈ వెధవబ్రతుకు ఎప్పుడు తెల్లవారుతుందో!"

అతను దుఃఖం ఆపుకోలేపోయాడు చెక్కిళ్ళనుంచి గోర్వెచ్చని కన్నీరు జారిపోతూఉంది. ఆమె హృదయం కరిగిపోయింది. తనతమ్ముని దగ్గర తీసినట్లు దగ్గర తీసింది. కన్నీరు తుడిచింది.

"బాబూ! ఏడవకు. నీవు ఏడుస్తుంటే నా కడుపు తరుక్కుపోతూంది."

"జాలిగుండె కలవాళ్ళ కలాగే ఉంటుదమ్మా నా దీనచరిత్ర."

"బాబూ! దరిద్రదేవత పాదాలక్రింద పడి ప్రాణాలు విడుస్తూ అరిచే అరుపులు ఎవరికి వినబడతయి నాయనా?"

"దరిద్రులకు"

"బాగా చెప్పావు బాబూ"

"వెళ్ళిరానా అమ్మా! నాలుగురోజులూ చీకట్లో కలసి పోకముందే నాలుగిళ్ళు ముష్టెత్తుకుంటాను. నిన్నెవరో అన్న పూర్ణలాగ కాస్త అన్నం పెట్టారు. అప్పటినుంచి ఇప్పటివరకు,

"పస్తేనా"

"అవునమ్మా!"

"పాపం బాబూ! ఇవాళనుంచీ ముష్టెత్తక. ఇదిగో ఈ పదిరూపాయిలు తీసుకో. రేపు నాట్టిలుకొని అప్పు దానితో ఒక రూపాయిడబ్బు ఇస్తాయి. మళ్ళీ కొంత డబ్బిస్తాను. దానితో కొట్టు పెడుదువుగాని. లేకపోతే ఏ 50 రూపాయిలో ఇస్తే దొంగసొమ్మని దొంగలు అపహరిస్తారు."

"అమ్మా! ఇంతడబ్బే!"

"ఇంకా ఇస్తాను. బుద్ధిగా ఉండు బాబూ! నీవు నా తమ్మునివంటివాడవు."

"తమ్ముడన్నా, తమ్ముడన్నా! అక్కయ్యా. అక్కయ్యా! ఏమి నా అదృష్టం."

అతడానందం ఆపుకోలేక ఆమె రెండు పాదాల మీదా పడ్డాడు. అతణ్ణి లేవతీసి లాలించి "తమ్ముడూ! అదిగో మనమేడ. అప్పుడప్పుడు అక్కడకు రా."

"అప్పుడప్పుడే కాదు. రోజూ వస్తా."

"సంతోషం. వెళ్ళిరా ఇవాళ. బాగా భోంచెయ్యి."

"ఇంక భోజనానికి లోటేమిటి."

"హాక్ట్రెయ్ నాక్ రొట్టె
ఘరమ ఘరమ రొట్టె"

అని కేకలు వేస్తూ ఎగురుతూ పరిగెట్టాపా అనాథ బాలు డానందంతో.

దేవి ఆనందాశ్రువులను విడిచింది. ఆనందంతో ఇంటికి బయలు దేరింది. ఆమె కెదురయ్యారు సరోజిని ప్రసాదులు. ఒకరి ముఖం మరొకరు చూచి నిర్ఘాంతపోయారు. కొంతసేపటికి పవిత్రలోకంలో కాలు బెడుతున్న దేవే, పలుకరించ ప్రయ త్నించింది.

"ప్రసాద్! క్షేమమా !"

"క్షే—ఏ—మ—మే—ఏ—"

"ఏం? అలా మాటలు తడబడుతున్నావే"

"ఏమీ— లే— దు."

"ప్రసాద్! ఈమేనా నీభార్య సరోజిని?"

"అవునండీ దేవిగారు" అని సరోజిని జవాబు చెప్పేసరికి దేవీ ప్రసాదులు ఆశ్చర్యముగ్ధు లయ్యారు.

"చెల్లీ ! నా పే రెలా తెలిసింది?"

"కాలం తన వేయివేల బొంగురు గొంతుకలతో ఎప్పుడో నా చెవులో అరచింది."

"సంతోషం"

"దేవీ ! మీరు మాయింటికి మీ భర్తతో రేపు భోజనానికి రావాలని ప్రార్థన."

"ఆహ్వానానికి ఆనందం కాని"

"ఏం?"

"పతివ్రతలతో పంక్తి భోజనం చెయ్యడానికి ఈపాపి నోచుకోలేదు."

"దేవీ! మిమ్మల్ని "పాపి" అని ఎవ రన్నారు? అసలు పాపం చెయ్యనివా రెవరు?"

"ప్రసాద్‌వంటి మహాత్ములు చెల్లీ! నిర్మలమైన నీ కనురెప్పల నీడలలో నాదగ్ధ జీవితాని కెప్పటికైనా విశ్రాంతి లభిస్తుందని నా నమ్మకం సరోజినీ!"

"ఏమిటి దేవీ అలా అయిపోతున్నావు?"

"చెల్లీ! పిచ్చి పోయిందికదా!"

"నాకు పిచ్చేమిటి?"

దేవి ప్రసాద్‌వంక చూచింది. ప్రసాద్ తల సిగ్గుతో క్రుంగిపోయింది. అత డాడినఅబద్ధాలన్నీ రూపుదాల్చి,కన్నుల ముందు భయంకరనృత్యం చేస్తూఉన్నాయి.

"చెల్లీ! ఆమధ్య భర్తృ దర్శనం కాక పిచ్చిదానివలె అయిపోయావని విన్నాను, నిజమేనా?"

"నిజమే"

"ఇప్పుడు స్వస్థతగా ఉందా?"

"ఉన్నది....మీరు మాత్రం రేపు"

"క్షమించు. అన్యథా తలచక అనురాగహృదయాల పైన అగ్ని వర్షం కురిపించలేను. అమృత పాత్రలపై హాలా హాలం వర్షించలేను. చెల్లీ! సెలవు. ప్రసాద్ నమస్కారం. ఈ పాపిని మరచిపోండి"

ఆమెకన్నులు తేమగిల్లాయి. కంఠం రుద్ధమయింది. ఆమె యింకేమీ మాట్లాడలేక రూపు దాల్చిన శోకమూర్తి

లాగ వెళ్ళి పోతూంది. వా రలా నిశ్చేష్టులై చూస్తున్నారు. సుఖ దుఃఖాల కలియకే సృష్టి. ఈ విచిత్ర సంఘటన వలన ఎవరికి తెలియదు? ఆమె అటు వెళ్ళిపోయింది. వారు మరో వైపు వెళ్ళిపోయారు. మనం!...

* * *

## ౨

అది అతి ప్రశాంత నిశాసమయం. ఆకు అల్లాడటం లేదు; పక్షిరుతం వినబడడం లేదు. పాడుపడిన శ్మశానంలా ప్రశాంతంగా ఉందా ప్రకృతి. ఆకాశాన్ని చూస్తూ దేవి పాట ప్రారంభించింది.

"రెక్కలు నరికీ
గొంతుకు పిసికీ,
మందును వేస్తావా?
ప్రభూ
మంటను వేస్తావా!

*

కిన్నెర నిచ్చీ
తీగలు తెంపీ
రాగము తీస్తావా!
ప్రభూ
రక్తము తీస్తావా!

*

ఆకులు రాల్చి
కోకిల చంపి
శిరుడ వొత్తావా!
ప్రభూ
ధీరుడ వొత్తావా!"

* * *

"దేవీ ! ఏం పాట లివి?"

"మీరేనా ! వచ్చారా !"

"ఏం?"

"ఇలా రండి. నా పక్కలో కూర్చోండి"

వెంకటేశం గారాబంగా భార్య పక్కలో కూర్చున్నాడు.

"దేవీ ! హృదయం ఇంత తీవ్రంగా కొట్టుకుంటుందే"

"తీవ్రంగా పరుగెత్తే భావాల ననుసరించలేక గుండె బద్దలై పోతూంది."

"భావాలు తీవ్రంగా రావడానికి కారణం?"

"ప్రకృతిలోని మార్పు"

"సృష్టికే మార్పు సహజమైనప్పుడు దానిగురించి ఆలోచనెందుకు?"

"పొరపాటే"

ఆమె కన్నుల నీరు జారి చెవుల్లో పడుతూ ఉన్నాయి.
వెంకటేశం ఆశ్చర్య పోయాడు.

"దేవీ ! ఎందు కీ కన్నీరు?"

"నా పాపపు జీవితం తలుచుకుంటూ ఉంటే నా హృదయం కరిగి కన్నీటి కాల్వ అయిపోతూంది."

"గడచిన చీకటిని తలచుకొని కలత చెందేదానికంటె రాబోయే వెన్నెల తలచుకొని ఆనందించడం మంచిదికాదూ"

"చీకటి ముసుగులో దాగున్న నా బ్రతుకు, వెన్నెల వెలుగులు కూడా చూడగలదా"

"తప్పక"

"ధన్యురాలను"

"పండుకో, శరీరానికి విశ్రాంతి లభిస్తుంది"

"మనసు మాత్రం కలల్లో కాలిపోతుంది."

"పరవాలేదులే పండుకో!"

"తమరాజ్ఞ!"

అత డామెపై శాలువా కప్పి తన మంచంమీదకు వెళ్లిపోయాడు. కన్నీటితో నిండిన ఆమె కన్ను రెప్పలతో మూతలుపడ్డాయి. తలగడమాత్రం తడిసిపోయింది. పాపం! భగ్నహృదయ జీవితమే కన్నీటి కాలువకదా!

* * *

చీకటి రేకలను చీల్చుకుంటూ బాలసూర్యుని బంగారు కిరణాలు ప్రకృతి అంచులపై వింతవింత రంగులను దిద్దుతూ ఉన్నాయి. అబ్బా! శుభప్రభాతం ఎంతసుందరమైంది. ఆరీ ఆరని తల వాలుజడ వేసుకొని విడీవిడని గులాబీ పూల చెండును జడలో కీలించి రతీదేవిలా మన సరోజిని పూజకై పూలను కోస్తూంది తోటలో. నిలువనీయని వలపు వయసు; కలతచెందే కలువ కనులు; తళుకు లొలికే సిగ్గు బుగ్గలు;

పలుకుతోంది మూగగుగులు; సుధలు చిందే మధురసంగం, లాలనా సాగించిన రాజ్యానికి రాణిని చేశాయి. శృంగారసరసిలో కలహంసిని చేశాయి. ఆమె ఆనందసంధానం; అనురాగనిధానం; కొమ్మనుంచి కొమ్మకేగే కోయిలలాగ పూవునుంచి పూవుకేగే తుమ్మెదలాగ పొదరింటినుంచి పొదరింటికి నడుస్తూ పూలుకోస్తూ ఆడుతూ పరవశంతో పాడుతోంది.

*　　　*　　　*

గీతం: — "పూలన్ని నేను విచ్చి
పోల్చుకుంటున్నాయి;
పూలన్ని పూజకై
ఎదురు చూస్తున్నాయి;
ఈ పూలతో నోము
నే నోచుకుంటాను;
ఈ పూలతో ప్రియుని
నే పూజ చేస్తాను;

*　　　*　　　*

అనురాగ సరసిలో
అలలమై పోతాము;
ఆనంద వనములో
అలుగులై పోతాము;
ప్రేమ వీణియలోన
శ్రుతులమైపోతాము;
ప్రేమ రాజ్యములోన
ప్రియులమైపోతాము;

*　　　*

తెలిమల్లె పడవపై
తేలిపోతా మింక:
చలువ వెన్నెల చేల
కలిసి పోతామింక;

ప్రూల బాటల మేమె
చేల మాటున మేమె
కలికి పాటల మేమె
వలపుకౌగిట మేమె

అన్నింట మేమే
అందాల మేమే
ఆటలో పాటలో
అన్నింట మేమే.

* * *

ఏమిటో ఆ ఆనందం! ఏమిటో ఆ అనురాగం!
సెలయేటి కెరటాల చిరుపాటలో తేట
వలపించి మురిపించు వనతేనెలో తేట
ప్రీతినించి మధు విచ్చు కలికి కోయిలపాట
జతగూడి పాడేటి యెలతుమ్మెదలపాట

కలసి మెలసి అమృతవాహినిగా జాలువారిందాపాట!
ఆమె యెంత ఆనందమయి; ఆమె యెంత అనురాగమయి!

"వసంత కోయిల గొంతులో మధుర గీతంలా, నీ గొంతులో ఎన్ని అమృత వాహినులను దాచుకన్నావు 'సరోజ్!'' ఆ మాటలతో ప్రత్యక్షమయ్యాడు. మోహన్, చిరునవ్వు పెదవిపై చిలుకరిస్తూ, ఆమె హృదయం ఝల్లు మంది.

సరోజని ఏకాంతంగా ఉన్నప్పుడు చూడాలనే మోహన్ ప్రయత్నం ఇప్పటికి నెరవేరింది.

"సరోజ్"

"బావా ! ఇలా గొచ్చావే ?"

"ఏమని పిలిచావ్?"

"బా—వా—అని"

"ఏదీ మళ్ళీ ఒక్కసారి పిలువు."

"ఏం బావా !"

"అబ్బా! ఎంత తీయగా ఉందా పిలుపు. ఎన్నాళ్ళకు విన్నానా పిలుపు. ఎంత చక్కగా ఉంది. "ఏవోయ్ బావా !" అని పిలిచే దానికంటే ఆనందం ఏముంది?"

"నిజమే"

"సరోజ్ 'బావా' అనిపదిమందిలో కూడా పిలువబడే స్వాతంత్ర్యత నాకు లేకపోయింది కదా !"

"ఏం?"

"నేను నీకు బావను కాదుకదా!"

"ఏంచేత?"

"నీకు తెలీదా ?"

"మేనత్త మేనమామ బిడ్డలు 'బావామరదళ్ళు' అని మాత్రం తెలుసును"

"సరోజ్, బావామరదళ్ళమైన మనం చిన్నప్పటినుంచీ ప్రేమించుకున్నావే. పెళ్లికూడా చేసుకుందా మనుకున్నామ్, పెళ్ళిచేసుకుంటే భార్యాభర్తలమయ్యే వాళ్ళం. కాని ఇప్పుడు నీ తల్లిగారి తమ్ముడు, మేనమామ; నాతండ్రి తమ్ముడు, బాబాయి

అయిన ప్రసాద్ పెళ్ళిచేసుకున్నాను. కాబట్టి, నీవు గారి "పిన తల్లి"విగాని "మరదలవు" కావుకదా !"

"అవును"

"పెళ్ళి చేసుకుందామనుకున్న మరదలు పిల్ల పినతల్లి అయ్యేదాని కంటే ఘోరం ఇంకేముంది? "ప్రియసీ!" అని పిలిచే అబలను "పిన్ని" అన్ని పిలిచే దానికంటే నీచం ఏముంది?"

"బావా ! బాగా ఆలోచిస్తే మనవరిసలెంత ఘోరంగా ఉన్నాయి"

"ఇటువంటి వరసలు పెట్టుకొనే మహ్మదీయులను మనం ఆక్షేపిస్తున్నాం, వారు పినతండ్రి కూతుర్ని చేసుకుంటే మనం చెల్లెల కూతురును చేసుకుంటున్నాము. తండ్రి కూతురు కాకటికి, పిన తండ్రికూతురు కాకపోనా, అలా చెల్లెలను చేసుకుంటారా అని ఆక్షేపించిన సంఘం తనకూతురు కాకటికి, తన చెల్లెలకూతురు కాకపోనా —ఛా—ఛా —కూతుర్నెలా చేసుకుంటారని ఆక్షేపించదే?"

"ఏమిటో ఈ వరస వాయిలకు అర్థం లేదు"

"స్వార్థపరులు కల్పించిన వాయివరసలకలా అర్థం ఉంటుంది. అన్నిదారులూ తెంచుకొన్న రహదారి వారిప్రేమ దారి. ప్రేమతత్వం తెలియని కాముకులు కల్పించిన వావి వరసలకే కదూ మనం కట్టుబడింది?"

"అవును."

"సరోజ్-మనం ఎంత నిర్మలంగా ప్రేమించుకున్నామో మరచి పోయావా?"

"లేదు."

"ఆటల్లోనూ—మాటల్లోనూ—ఒకటైన మన ఆనంద జీవితాలను మరచి పోయావా?"

"లేదు."

"ఒక కంచంలో తిని ఒక మంచంమీద పండుకొన్న మన ప్రణయ బంధాన్ని మరచి పోయావా?"

"లేదు."

"సరోజ్! ఎన్ని జన్మలకైనా మనం వేరుకాకూడదు సుమా!" అని నే నన్నప్పుడు "ఎలా వేరవు తాం. మనలను వేరు చెయ్యడానికి ఎవరికి శక్తి ఉంది?" అని నీ వానా డెంత గారాబంగా అన్నావో మరచి పోయావా!"

"ఏదీ మరచిపోలేదు. అన్నీ జ్ఞాపకం ఉన్నాయి"

"అటువంటి ప్రణయిని నన్నెలా మరచిపోయావు?"

"నేను మరచి పోలేదు"

"ఒహోహో! నేను మరచి పోయానా?"

"నీవూ మరచిపోలేదు."

"అయితే పరిసాదు నెందుకు పెళ్ళి చేసుకున్నావు?"

"అది నాకర్మ. పెద్దల ఆజ్ఞ"

"ఎలా ప్రేమిస్తున్నావు?"

"అది నావిధి కాబట్టి."

"పెళ్ళి చేసుకుంటం 'కర్మ', ప్రేమించడం 'విధి' ఏం?"

"అవును."

"సరోజ్! నన్నిలా ప్రేమపిశాచినిచేసి మోసగించడం న్యాయం కాదు సుమా!"

"ఒప్పుకొంటాను. నేను తుచ్ఛురాలనే. అయితే నీ వెందుకు పెళ్లి చేసుకున్నావు?"

"చేసే దేమీ లేక"

"ఎవరైనా అంతే."

"అంతేనా?"

"అంతే. ఎదటి హృదయాన్ని అర్థం చేసుకోలేని బ్రహ్మ సృష్టిని అర్థం చేసుకున్నట్టే."

"ఇలాగా?"

"అవును."

ఆమె మాట్లాడకుండా వెళ్ళిపోయింది. అతనలా నిశ్చేష్టుడై చూస్తున్నాడు.

* * *

ఏమిటీ సృష్టి వైపరీత్యం దేవీ మోహనులు చిన్ననాటి మిత్రులు, ఎడబాటు సహించలేని ప్రియులు, వివాహం చేసి వారి ప్రేమను పవిత్రం చేసుకుందా మనుకున్నా సవితుల్లు, అటువంటి దేవీ మోహనులను వేరుచేసి, హృదయాలు లేని యని మరొక జంటతో మేళవించారు. దేవితండ్రి ధనాశచే దేవికి వయసు వెలుగు తొలగిన వెంకటేశానికి ద్వితీయ కళత్రంగా అంటకట్టాడు. మోహను పినతండ్రి ధనాశచే వెంకటేశం చెల్లెలు కురూపి దమయంతిని మోహనునికి కట్టాడు. వారి జీవితా లలా భగ్నంఅయ్యాయి. తిరిగివా రొక ఇంటిలోనే జేరారు. వారి హృదయా లెలా గుంటాయో ప్రాజ్ఞులాలోచించండి.

ఆదంపతు లలాగుంటే ఇక్కడ బావా మరదళ్ళైన సరోజ గోవిందరావులు చిన్ననాటనుంచి ప్రేమించుకున్నారు. కాని ప్రసాద్ (ఫారెన్ రిటండ్) Foreign Returned అని ప్రసాదుచే సరోజిని తలవంచి మంగళ సూత్రం కట్టించాడు. మంగళ సూత్రానికి దాస్యంచేస్తూ, భర్తే భగవంతునిగా ఆరాధిస్తుంది సరోజిని, వాళ్లు ఆనందంగా ఉంటే ఈ నూతన దంపతులు ప్రణయరంగం మీదను కొత్తవేషాలతో దిగారు. అటు దేవీ వేంకటేశం ఆనందంగా ఉన్నారు: ఇటు సరోజినీ ప్రసాదులు అనురాగంగా ఉన్నారు: వారివారి దాంపత్యాలు భిన్నం చేయడానికో అన్నట్లు మోహన్ గోవిందరావులు దిగారు. ఇక వారి మానసికప్రవృత్తి వారి ప్రణయమూర్తి ఎలాగుంటాయో చూద్దాం. "ప్రేయసి! ప్రేయసీ!" అని పిలిచిన దేవి నిప్పుడు మోహన్ "చెల్లీ! చెల్లీ!" అని పిలవాలి కదా! "ప్రేయసీ! ప్రేయసీ!" అని పిలిచిన సరోజినిని గోవిందరావు ఇప్పుడు. "పిన్నీ! పిన్నీ!" అని పిలవాలికదా! 'చెల్లీ' అని నోరారా పిలిచినంత మాత్రంలో ఆ పదాలకు పవిత్రభావం ఆరోపింప బడుతుందా? మాట మారితే లాభం ఏముంది? మనసు మారాలిగాని. అందుచేతే మన దేశంలో పగలు 'చెల్లీ' 'పిన్నీ' అంటూ ఎంతో గారాబంతో పిలుస్తూ, చీకటిమాటున పయిట చెంగులాగి పరాభవించే పెద్దమనుష్యుల నెంతమందిని మన కళ్ళారా చూస్తున్నాం. 'చెల్లీ'—'పిన్నీ' గానుండా వ్యభిచరించే దుర్మార్గుల నెంత మందిని మహాత్ములని గౌర విస్తున్నాం. ధనసంచుల మాటున వాళ్ళకళ్ళను దాచుకొ

చూచి ఆనందిస్తున్నాం గాని అనుభవించలేకుంటున్నాము?
న్యాయం ఎక్కడుందో చెప్పండి?

* * *

3

గీతం;—

"తెల్ల వెన్నెల లోన
మల్లియలు నవ్వాయి;
నవ్వులో లోకాల
కవ్వించి పిలిచాయి;

తేనె కాలువ పైన
తెలి మల్లె పడవలే
తెరచాప లెత్తాయి;
కడలి దాటేదాక
నడిపింతువా!
దేవా!
కడలిదాటే లోపు
పడవైతువా!

* * *

కొమ్మ కొమ్మకు నెగిరి
కోయిలలు కూశాయి;
మధు వసంతమ్ములో
మైమరచె జగతియే—

విశ్వసుందరి గొంతు
వీణియలు మ్రోగాయి;
అమృత గానము జగతి
హాయిగా పాడింది;
పాటలోనే వీణ
పలికింతువా!
దేవా!
మాటలాడక తీగ
లెడ సేతువా!''

* * *

పండువెన్నెలలో- తోటలో- ఇసుకమీద బోర్లాపండుకొని- మల్లెపూలను కళ్ళ కద్దుకొంటూ- ఆపాట పాడుకొంటూ ఉంది దేవి. సన్నని, పలుచని, శరీరం మెరుపులా మెరిసిపోతూంది. విశాలమైన దేవి కలువ కన్నులు చూస్తున్నా; గులాబీరేకులవంటి పెదవులపై ముత్యాలలా మెరుస్తున్న చిరునవ్వు చూస్తున్నా; అమృతవాహినులు స్రవించే ఆమె మృదుమధురకంఠం వింటున్నా: హృదయాలెందుకో సుధాప్లావితాలౌతాయి. దేవి కోకిల్లా తీయగా పాడగలదు; ప్రపంచాన్ని పరవశం చేసేటట్లు భరతనాట్యం చేయగలదు. ఆమె లలిత కళావిలాసిని: ఆనందరస రాజ్య పట్టభద్రిణి; అనురాగ గంగా తరంగిణి; ప్రణయభిక్ష పెట్టలేని లోకం ఆమెను పాపి అంటుంది. ఏమిటో! హృదయ నిగూఢ వేదనలు తెలుసుకున్నా వాడొకడైనా ఉండడేమో అనిపిస్తుంది. దేవి పాడింది పాడింది- అలిసిపోయింది. పూలవంక చూస్తూంది.

• • •

"మధుర స్వప్నాలలో సౌందర్యమూర్తిలా ఎలాపుస్తా కున్నావు దేవి !"

ఆమె తలెత్తి చూచింది. ఆమె కనుల యెదుట పసిడి నిమ్మపండులా మిలమిలా మెరిసి పోతున్న మోహనాన్ని చూచింది. హృదయం చలించింది.

"దేవి !"

"మోహన్"

"ఏం ఇలా ఏకాంతంగా పండుకున్నావు?"

"ఏకాంత సేవలో ఆనందం ఉంది కాబట్టి"

"ఏకాంతసేవ యోగులకుగాని మన కెందులకు దేవి !"

"మనం మాత్రం యోగులం కాకూడదా?"

"యోగులమే !"

"ఏం ఎందుక్కాకూడదూ ! ఆయున వా గందరూ మహాకొమ్ములు తిరిగిన వాళ్ళా !"

"ఉహూం"

అత డామె ప్రక్కన అతి స్వతంత్రంగా కూర్చున్నాడు. ఆమె లేవనైనా లేవలేదు? కదలనైనా కదలలేదు.

"దేవి ! నీ కనులు చూస్తూంటే ఏదో నూతన జగత్తు నిర్మించుకున్నట్లుందే"

"అలాగే ఉంటుంది."

"అబ్బా ! ఎంతగా మారిపోయావు"

"ఇంకా మారాలి మోహన్ !"

"ఈ మార్పులో, నీ ప్రియమోహనుని మరచి పోలేవు కదా !"

"మరచి పోవడం ఎందుకు?"

"దేవి! హృదయానికి హృదయం దగ్గర చేసుకొని మాట్లాడి ఎంతకాలం అయింది?"

"చాలాకాలం."

"భగవంతుని దయవల్ల మళ్ళీ మనం కలుసుకున్నామంటే చాలా ఆశ్చర్యంగా ఉంది.

"ప్రపంచమే ఆశ్చర్యమైనది, అందు భగవంతుని ఉనికికూడా ఆశ్చర్యమైనదే."

"అవును."

"నిజానికి భగవంతుడనే వాడొకడున్నాడని లోకానికి చెప్పింది మానవుడు కదూ! భగవంతుని పేర రాతిబొమ్మలను సృష్టించిన కళాస్రష్ట మానవుడే కదూ?"

"అవునుగాని - ఇలా ఆధ్యాత్మిక చింతన అలవడిందే"

"అఖిల రోజుల్లోనైనా అబ్బొద్దా!"

"ఆఖరిరోజులేమిటి?"

"కాదామరి! బ్రతుకు బరువైన భగ్న జీవికి ఆనందం ఎడబాసినప్పుడు ఆఖరు రోజులుకాక ఏముంటుంది??"

"అలా అనకు దేవీ! మన ఆనందం మన అరచేతుల్లో అమృతభాండంలాగా ఉంది. అమృతభాండాన్ని ముక్కలుచేసి అపవిత్రం కలిగించినా మనమే, అమృతాన్ని ఆస్వాదించి ఆనందించినా మనమే, పూల జీవితాలను పూజించినా మనమే, పూలు చిదిమి బుగ్గిపాలుచేసినా మనమే. సర్వం మనలోనే ఉంటుంది. ఆనంద సామ్రాజ్యానికి అధినాథులమైనా మనమే, బానిసలమైనా మనమే. మన హృదయాలు

మన స్వాధీనంలో ఉంటే ఆనందగంగాతరంగిణిలో అవగాహనం చెయ్యం? దేవీ, ఇటుచూడు! వలపుగాలికే ఈ కనుల నొకసారి నావైపు త్రిప్పు, చిరునవ్వు చిందే ఆ పెదవుల నొకసారిలా...”

“ఏమిమాట లివి మోహన్”

“దేవీ! పూర్వం మన మిద్దరం షికారు వెళ్ళేటప్పుడు ఇంతకంటే తేనె లొలుకు తీయనిమాటలు చెప్పుకొనే వాళ్ళం కదూ?”

“స్వప్నజీవితంలో గడచిన మన సమాగమాన్ని మళ్ళీ జ్ఞప్తిచేసుకుంటం ఎందుకు?”

‘ఆశలుహత్తుకుంటానికి, అనురాగం పండించుకుంటానికి’

“శిథిల జీవిత భాండంలో వలపువాన నింపగలవా? ముక్కలైపోయిన ఆశాసౌధంలో అనురాగ జ్యోతి వెలిగించ గలవా? మురికికాల్వపై పూరేకపడవ నడిపించగలవా? మోహన్! బండరాతిపై వసంతలక్ష్మి బంగారు పాదాలు మోపించగలవా? పర్వతం తాకి ముక్కలైపోయిన పడవపై ప్రయాణం చేయగలవా? కనులు పోయిన గుడ్డివానిచే కలియుగ నాటకాన్ని చూపించగలవా? మాట్లాడవే మోహన్!”

“మన మనసుల్లో కల్పించుకొన్న చీకటి చెట్ల నీడల్లో నిలిచి, లోకంలో వెలుగు ప్రదేశాలను చూడలేక విచారిస్తున్నామంటే ప్రయోజన మేముంది? ద్రాక్షపొదల్లో శయనించి, దాహానికి పరితపించే మూర్ఖుల్లాగ రసపిపాసులైన ప్రియులు సాంకేతికస్థలంలో, పండువెన్నెల బయల కూర్చుండి, వాదోప

వాదాల్లో కాలం వ్యర్థాచేస్తూ, ఆనందం అనుభవించలేక పోతున్నారంటే ఎంత వింతగాఉంది?"

"జీవితమే వింత"

"అవును. జీవితం వింత, బ్రతుకు వింత, సృష్టివింత, నీవు వింత, నేను వింత, ఈ వెన్నెల వింత, ఆ చెట్లు వింత, తుదకు నీపిచ్చికూడా వింతే! దేవీ! ఎందుకు వచ్చిం దీ వెఱ్ఱివేదాంతం? పాతపాటలు పాడుతూ పవిత్రమైన కాలాన్ని పాడుచేసుకుంటానికి తప్ప ఎందు కొచ్చిం దీ తర్క వితర్కం?"

"మోహన్"

"దేవీ! హృదయ మందిరానికి వైచిన చీకటి తలుపులను వెలుగు చేతులతో తీసి ప్రేమదేవత నారాధించు! 'ప్రేమపూజ' కంటె పూజ ఈ ప్రపంచంలో మరొకటి లేదు. చూడు, తన కన్నె వలపును కాన్కపెట్టే కలువ కన్నెకన్నులలోకి వెన్నెలరేడు తన వేయి కన్నులతో ఎలా చూస్తున్నాడో! అలాచూడు, మరుగుతూ మరుగుతున్న మాలతీ హృదయ పాత్రలోని మకరందాన్ని ఆస్వాదించడానికి ఆతుమ్మెదవలపు కాడెలా కలవరిస్తున్నాడో! చూడు, ఆ గున్న మామిడికొమ్మమీద కోయిల దంపతులెలా గుసగుసలు చెప్పుకుంటున్నారో."

"మోహన్! రాలిపోయిన పూలరేకులన్నీ జతకూర్చి తిరిగి పూలగా చేయగలమా? విరిగిపోయిన కుండ పెంకు లన్నీ దగ్గరకు జేర్చి కుండగా చేయగలమా?

"చేయ లేం"

"అలాగే చిదికి పోయిన నా హృదయ పాత్రను అందించి, ప్రణయామృతాన్ని పోయాలనుకుంటం శవంలో ప్రాణం పోయటమే "

"అయితే ఏమంటావు దేవీ!"

"ఈ జన్మలో నన్ను పవిత్రంగా చూడలేకపోతే మరచిపో!"

"మరచి పోవటం సాధ్యమా!"

"సాధ్యంకాక పోతే నీ సోదరిగానే జ్ఞాపకముంచుకో?"

"సోదరిగానా?"

"అవును"

"ఎలా దేవీ?"

"మోహన్! మంచికాలవలో మురికివేసి, దానిని మురికి కాలవ చేయడంలో మానవుని ఔన్నత్యం కనబడదు. మురికి కాలవలో మురికి తీసివేసి మంచి నీటిని ప్రవహింప చేయడంలో ఔన్నత్యం కనబడుతుంది"

"ఊహూ!"

అతడొక్క నిట్టూర్పు విడిచి ముఖం విసుగుదలతో మరోప్రక్కకు తిప్పివేశాడు.

"మోహన్! చెడుబుద్ధిని మంచి బుద్ధిగా మార్చు కుంటం గొప్పగాని మంచి బుద్ధిని చెడుగా మార్చడం ఎంత"

"కబుర్లకు కార్యాలకు చాలభేదం ఉంది."

"అవును."

"అయితే దేవీ! ఇక మన పూర్వస్నేహాన్ని తిరిగి పుష్పింపజేయవా?"

"కలలో కూడా వీల్లేదు."

"ఆముసలి పీనుగే నీకు దైవమా?"

ఆమెకు కోపం వచ్చింది.

"మోహన్! ఆయన పీనుగైతే నేను విధవను కానా? ఆయనను నిందిస్తే నన్నూ నిందించినట్లే. ఆయన పాదదాసిని నేను."

ఓ హో! హో! అన్నీ అయ్యాక మిగిలింది పాతి వ్రిత్యమే."

"మోహన్! నేను చేసిన పాపపంకిలం కడిగివేయు డానికి నా భావిజీవితం చాలు."

"చాలే?"

"చాలు. ఈజన్మలో నేను "పతిత"ను. వచ్చేజన్మలో నేను "పతివ్రిత"ను. ఈ జన్మ వచ్చే జన్మకు పునాది అని మరచ పోక."

"పంటి బిగి—కంటిచూపు—వంటి శక్తి- లేనిముసలి. వారి పడుచు భార్యలకు మిగిలిందే ఈ వేదాంతో సన్యాసం, ప్రేమచూపి స్వాధీనం చేసుకోలేరేమో, ఈ మెట్ట వేదాం తంతోనైనా స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నం చేస్తారు."

"జీవితానందానికి ప్రధానం ప్రేమకాని, వయస్సు కాదు."

"తెలును. తెలుసు. ఈమాట లన్నీ ఆముసలి నక్క నేర్పాడని తెలుసు" అంటుంటే నవ్వుతూ వెంకటేశం తయా రయ్యాడు. మోహన్ లేచి వెళ్ళబోయాడు. మోహన్ చేయి పట్టుకొని "ఏంమోహన్! అప్పుడే వెళ్ళిపోతున్నావ్. చక్కగా

వెన్నెట్లో కాసేపు కూర్చుందాం" అని ఎంతో ఆప్యాయంగా అన్నాడు వెంకటేశం.

"భార్యా భర్తల మధ్య నేనెందుకు?"

"ఎంతమాట! నీవు తప్పక ఉండాలి."

"క్షమించాలి"

"అయితే మీ ఆనందానికి భంగం కలిగించినవాణ్ణవుతాను." అంటుంటే దేవి భర్త ముఖంలోనికి చూసింది.

"మా ఆనందానికి భంగంలేకుండా ఉండమన్నారు. ఉండనని వెళ్ళేవారిని ఆపగలరా? మోహనుని వెళ్ళనీయండి"

మోహన్ మళ్ళీమాట్లాడకుండా కోరచూపులుచూస్తూ వెళ్ళిపోయాడు. దేవి తనభర్తను తన ప్రక్కన కూర్చోమంది. ఇద్దరూ ఆనందంగా చంద్రుని చూస్తూ, కపటం లేని కబుర్లు చెప్పుకుంటూఉన్నారు. నల్లమబ్బు చేతులనుంచి చందమామ జారిపోతుంది. ప్రేమాకాశం మీద దివ్యంగా ప్రకాశిస్తూఉంది.

* * *

౪

కొందరు పైకి నవ్వుతూనే ఉంటారు, లోపల మోయలేని బరువు మోస్తూనే ఉంటారు. వారే ధీరులు. మానవుని ధైర్యం కష్టాలు భరించడంలోనే కనబడుతుంది; సంపదను భరించడంలోకాదు. వంటలవాడైన వెంకన్నకూడా ధీరుడే. అతని హృదయంలో ఎన్నో అగ్నిపర్వతాలు పిండైపోతున్నాయి; పొగద్వారా ఒక్క నిట్టూర్పుకూడ విడవడం లేదు. ఎన్నో సముద్రాలు అతని హృదయ గర్భంలో

పొంగిపోతున్నాయి; నీటిచుక్క ద్వారా ఒక్క కన్నీటిబొట్టు కూడా విడువలేదు. మోహన్ రంగస్థలంమీద ప్రవేశించి నప్పటినుంచీ అతని జీవితనాటకం పండి రక్తి కట్టింది. మృత్యుదేవత పాడే మంగళహారతి - కర్మదేవత వెలిగించే కర్పూరంతో - అతని జీవితనాటకానికి చివరి తెర జారిపోతుంది. ప్రేక్షకులు చప్పట్లు చరుస్తూ ఇళ్ళకు వెళ్ళిపోతారు. ఆతరుణం ఎప్పుడు? దానికోరకే గుంటలు పడిపోయిన అతని కన్నులు ఎదురుచూస్తున్నాయ్; ఆతనిహృదయం కన్నై. రెప్పలు రెపరెపా కొట్టుకుంటున్నాయ్.

మోహన్ తోటలోకి బయలుదేరాడు. మోహన్ అంటే ఎందుకో వెంకన్నకు పంచప్రాణాలు. వెంకన్న తోటలోకి వెళ్ళి పూలవంక చూస్తూ కూర్చున్న మోహన్ఎదుట, అపార వాత్సల్యంతో నిలబడ్డాడు.

"మోహన్ బాబూ" అంటూ తడబడే గొంతుకతో పిలిచాడు, కన్నబిడ్డను పిలిచే తండ్రిలాగ.

"ఏం వెంకన్నా! అలా చూస్తున్నావ్"

"మోహన్ బాబు! మీ కీ వూరు నచ్చిందా?"

"ఏదో మొదట బాగానే ఉంది."

"తరువాత?"

"ఎడారిలా గుంది."

"ప్రేమకోసం చాచిన చెయిమీద ఆనంద వర్షం కురియకపోతే, ప్రపంచం ఎడారిగా పోతుంది."

వెంకన్న నోటినుంచి వెలువడే ఆ మాటలు వింటున్న మోహన్ ఆశ్చర్యపోయాడు.

"వెంకన్నా!"

"ఏం బాబూ!"

"నీవు నిజంగా వంటలవాడివేనా?"

"వంటలు వండడం మీరే చూచారు కదండీ!"

"వంటవానిగా నీ వీ యింట్లో చేరకముందు ఏంచేసే వాడవు?"

"............"

"మాట్లాడవే వెంకన్నా?"

"............"

"అయ్యో! అదేమిటి అలా కన్నీరు కారుస్తావ్?"

"బా...బూ!"

"ఇంత గారాబంగా పిలవడం ఎక్కడ నేర్చుకున్నావ్ వెంకన్నా?"

"బిడ్డలవంటి మిమ్మల్ని చూచినప్పటినుంచే.

"పాపం."

"పండిపోయింది బాబు."

మోహన్ ఉలుక్కి పడ్డాడు. పండింది అతనిపాపమా? వెంకన్న పాపమా? ఆ ఆలోచనతో అతని గుండెలు పిండై పోయాయి.

"వెంకన్నా! నీవూనాలాఏదో భగ్న జీవిలాగున్నావే"

"అందుచేతే మిమ్మల్ని చూస్తూఉంటే నా కపారమైన ప్రేమ. బాబూ! ప్రపంచంలో భగ్న జీవులంతా ఒకకంటు బానికి చెందిన వారే. వారి కన్నతల్లి దరిద్రదేవత, వారి మిత్రులు నక్షత్రాలు, వారు దాడుకొనే స్థలం ఆకాశం, వారు

కష్టంకొనే దుప్పటి చీకటితెర, వారి సంపద కన్నీటి ముత్యాలు."

"వెం—క—న్నా!"

"అలా ఆశ్చర్యపోతావేం బాబూ! ఈ వృతశాఖ కూడా ఒకప్పుడు చివురించిందే. ఈ మోడు చెట్టుమీదకూడా ఒకప్పుడు కొన్ని పక్షులు నివసించినవే. ఈ చెట్టునీడ కూడా కొన్ని తలలకు ఆశ్రియం ఇచ్చిందే. బాబూ! వసంత లక్ష్మి ఒక్క చోటే ఉండలేదు. ఉంటే మిగిలిన భూచక్రం అంతా శ్మశానం అయిపోదూ! లక్ష్మిలాగే వసంతలక్ష్మి బహుచంచల మైనది. బాబూ! ఆ వసంతలక్ష్మి ఈ వృక్షాన్ని విడిచింది; మరో వృక్షాన్ని ఆశ్రయించింది. దీని ఆకులు పండిపోయాయి, దాని చివురులు ఆకులయ్యాయి ఇవి రాలిపోయే సరికి అవి పటాకులై పోతాయ్. ఇంతేకదు బాబూ ఈ సృష్టిసౌందర్యం" మోహన్ స్తబ్ధుడై పోయాడు. వెంటనే లేచి వెంకన్న చేయి పట్టుకొని అతని ప్రిక్కనే కూర్చుండ బెట్టుకున్నాడు.

"వెంకన్నా! క్షమించమని ఈ రెండు చేతులూ ఎత్తి ప్రార్థిస్తున్నాను. క్షమించు"

"ఏంతప్పు చేశావని బాబూ!"

"నిన్ను సామాన్యుడనుకున్నందుకు."

"సామాన్యుని సామాన్యుడనుకుంటంలో తప్పేం?"

"నివు సామాన్యుడవా? నీవే సామాన్యుడవై తే ఇంక నీ ప్రపంచంలో మహాత్ము లేరే!"

"అహాహా!"

'నవ్వాక. నిజంకాంతే. నీవే మహాత్ముడవు. మేమంతా మహాత్ముల వేషం వేసుకున్న కపటభిక్షులం: దొంగసాధులం'

"బాబూ' చీకటిలో ప్రకాశించే నక్షత్రాలు పగలు లేవా? ఉన్నాయి. కాని, వాని ప్రకాశం పగలుండదు. అలాగే ప్రతిమానిలోనూ ఒక తేజం ఉన్నది. అది కష్టాలలోనే ప్రకాశిస్తుంది."

"బాగు బాగు."

"రత్నానికి వెనుక నల్లగుడ్డ ఉన్నప్పుడే ప్రకాశిస్తుంది. తెల్లగుడ్డ వెనకుంటే ప్రకాశించదు బాబూ!"

"నిజం నిజం"

"ఆపదలు లేనిమానవజీవితం, పుటం పెట్టనిబంగారం"

"అవును వెంకన్నా అవును. ఆపదలలో నే మానవజీవితం ఉత్తేజం పొందుతుంది"

"అంతేకాదు బాబూ! ఆశ నిరాశైనప్పుడు: ఆనంద హృదయం భగ్నం అయినప్పుడు; అమృత పాత్రలో హాలా హాలం కలిసినప్పుడు; మానవుని కన్నులలో మెరుపులు మెరుస్తాయి; కన్నీళ్లు వర్షిస్తాయి; అప్పుడే అతని హృదయంలో భగవానుడు సింహాసనం నిర్మించుకుంటాడు."

"వెంకన్నా! ఏమిటి నీ మాటలు! నేటివరకు మాటలు గాక, నాలో మూల్గుతున్న భావాలు నీ నోటివెంట మాటలు ద్వారా వింటున్నాను. ఎంత దివ్యంగా ఉన్నాయ్! నా హృదయానికి బిగించిన కాముక ద్వారాలన్నీ, ఎంత చక్కగా నీ చల్లనిచేతులతో తెరిచి వేసి, ప్రేమవాయువులను పంపిస్తున్నావ్!"

"బాబూ! కాముక ద్వారాలు తెరిచింది నేను కాను: ద్వారాల వెనుక నున్న ప్రేమదేవత"

"ప్రేమ దేవత!"

అత డా మాటలు అంటూ, ఆకాశాన్ని చూస్తూ ఉన్నాడు. అతని కన్నుల నీరు నిండింది.

"బాబూ! కన్నీళ్లెందుకు?"

"........."

"మాట్లాడ వేం బాబు"

"వెంకన్నా! నా రాతి హృదయం ఇప్పుడిప్పుడే కరుగుతూఉంది. కరుగనియి. కన్నీరుగా కారనియ్."

"బాబూ!"

"వెంకన్నా! చీకటిలో దారి కానని నాకు దీపం వెలిగించి దారి చూపించావ్. ఆ వెలుతురులో ప్రపంచకంఅంతా చూడగలుగుతున్నాను. అబ్బా! ఈ ప్రపంచం ఎంత శోభగా ఉంది."

"అవునవును. మబ్బు విడితే చంద్రుడు ప్రకాశించకుండా ఉంటాడా?"

"వెంకన్నా! నే నొక మహాపాపిని; తుచ్ఛుడను; మిత్రద్రోహిని; కాముకుడను."

అతని కన్నీరు జలజలా జారిపోతూఉంది.

"బాబూ! గడచిన జీవితం గురించి విచారించి కన్నీరు కార్చేదానికంటే - గడవబోయే జీవితాన్ని గురించి ఆలోచించుకోవాలి. జారిపోతున్న కాలివంక చూస్తూ ఉండేదానికంటె జారని కాలు ఊతగా తీసుకొని గట్టుఎక్కి- వెళ్లిపోవాలి"

"అలాగే. నేను వెళ్ళి వస్తా"

"ఎక్కడికి?"

"నా పాపపు ముసుగు తోసివేసి, నిర్మలంగా ఒకసారి దేవికి కనుపించి వస్తాను."

"సంతోషం."

మోహన్ త్రాచుపాములాగ దేవిదగ్గిర వెళ్ళిపోయాడు.

"నా గుణాలకూ, మోహన్ గుణాలకూ ఇంతకూడా భేదం లేకుండా బ్రహ్మదేవు డెలా పోతపోశాడో, కన్నీరు కార్చడంచేత మోహన్ హృదయం కొంత మెత్తపడవచ్చును. అలాగని సంపూర్ణవిజ్ఞాని అయ్యాడని చెప్పగలమా? ఈ మార్పు అతని హృదయాన్ని ఎంతకాలం పట్టి ఉంచగలదో! శ్మశాన వైరాగ్యంలాగ ఒక క్షణంలోనే మెరుపులా మంచి బుద్ధి నశించకపోతే, దేవి వెంకటేశులు బాగుపడుతారు, మోహన్ దంపతులుకూడా బాగుపడగలరు, లేకపోతే ఏమీ లేదు. ఏమిటో! ఈశ్వరేచ్ఛ!" అనుకుంటూ వెంకన్న ఒక చెట్టుకు ఆనుకొని, పచ్చగడ్డిని చేత్తో ముక్కలుచేస్తూ, నీలాకాశాన్ని చూస్తూ ఉన్నాడు.

* * *

మోహన్ క్షమాభిక్ష పెట్టుమని వేడుకుంటానికని దేవి గదిలోకి వెళ్ళబోయాడు. అంతలో దేవీ వెంకటేశం మేడ మీద గదిలో పెద్దగా నవ్వుకుంటూఉన్నారు. అతడు గదిలోకి వెళ్ళడానికి శక్తి లేక, ఆవరండాలోనే గదిమాటున నిలబడ్డాడు. ఆమె ప్రేమతో ప్రియునకు తమలపాకులు ఇస్తూఉంది. ప్రియుడు స్వీకరిస్తూ ఉన్నాడు. వారి ప్రణయదృశ్యాన్ని

చూచి ఆనందించలేపోయాను. వారిమాట లిలా వినిపిస్తూ ఉన్నాయి.

"దేవీ! నీకు నాయెడల ఎంత ప్రేమ?"

"అంతులేని ఆకాశం అంత."

ఇద్దరూ పకపకా నవ్వుకున్నారు.

"దేవీ! నీ వెంత మాటకారివి?"

"మనసిచ్చిన మీరు నా యెదుటుంటే, మాటలు కోటలు దాట కేంచేస్తాయ్."

"అలాగా?"

"ప్రికృతిలో కల సౌందర్యం అంతా మీ కళ్ళల్లోనే దాచుకున్నారు; జీవితంలోని మాధుర్యం అంతా మీ మాటల్లోనే దాచుకున్నారు; అటువంటి మీరు నా యెదుటుంటే స్వర్గం కాలితో తన్ని వేయనూ?"

"అబ్బా! ఏమి అనురాగం!"

"నా ఆనందానికే ఈ అనురాగం!"

"ఓహూ!"

అత డామెను దగ్గరకు తీసుకున్నాడు, వారి ప్రిణయోన్మాదం చూడలేపోయాడు మోహన్. వెంటనే మేడమెట్లుదిగి వెళ్ళిపోయాను. సావిట్లో కుర్చీలో కూలబడిపోయాడు. ఆకాశాన్ని మించినప్రేమా ? స్వర్గం కాలితో తన్నుతుందా ? ఏమి ప్రేమ ? తుచ్ఛరాల!" పళ్లు పటపటా కొరికాడు. కన్నులవెంట చింతనిప్పు రాల్చాడు.

"నాతో ఉన్నంతకాలం నీవే దేవుడవు; నీవు లేపోతే నేను బ్రితకలేను; నీవు నా హృదయానివి, జీవానివి, సర్వస్వం

నాకు నీవేలని ప్రమాణకాలుచేశావా? ఇప్పుడా పాతపాపాన్నే నీమగనికి అప్పచెబుతున్నావా ? నీవంటి కులటకు ప్రియు డెవ్వడు? ఎవడు దగ్గరుంటే వాడేకదా? రేపు ఈ వెంక టేశంగాడినే చంపితే, మళ్ళీ నీవు నా కౌగిలిలో వాలవూ? నీవే నాదైవాని వని నా హృదయమధ్యంలో నీకొలువుకూటం ఏర్పరచుకోవూ? చూస్తా నీ హృదయంలోతులుచూస్తా, నీ భర్తను చంపి, ఈమాటలే నీచేత అనిపించుకొని, నీప్రాణాలు కూడా తీసేవరకూ ఈ మోహన్ నిదురపోడనుకో!”

అలా ఆలోచనలపైన ఆలోచనలు బళ్ళెపోట్లల్లా అతని హృదయాన్ని చీల్చివేస్తున్నాయి. ఎంతచక్కగా పదును కుంటున్న హృదయం, క్రోధపిశాచానికి గురిఅయిపోయిందో!

“కామాత్క్రోధోభిజాయతే, క్రోధాద్భవతి సమ్మోహః”

అని భగవద్గీత ఎంతచక్కని ప్రబోధంచేసింది. కామంవల్ల క్రోధం, క్రోధంవల్లమోహం, మోహంవల్ల మతిభ్రంశం, మతిభ్రంశంవల్ల బుద్ధినాశం, బుద్ధినాశంవల్ల నశించడం సహజంకదా!

* * *

౫

దేవి ఒంటరిగా మేడమీద కూర్చుంది. సాయంకాలం అయిదుగంట లయింది. వెంకటేశం తన చెల్లెలను బజారుకు తీసుకువెళ్ళాడు. మోహన్ విషపునవ్వులు నవ్వుతూ ప్రత్య క్షం అయ్యాడు.

“మోహన్! నీవు బజారుకు వెళ్ళలేదా?”

"లేదు."

"ఏం? ఎందుచేత?"

"నీకోరకే"

"నేను ఉండమనలేదే, నీతో నా కేమీ పనిలేదే."

'అవునులే. ఇప్పుడెలాపనిఉంటుంది? పళ్ళులేని చెట్టును'

"క్షమించు మోహన్! నేను పాపంచేయలేదని చెప్ప లేదు. చేశాను, ఒకసారి పాపంచేశామని, ఇక తెలిసీ జీవితం అంతా పాపభూయిష్ఠం చేయడం ప్రాజ్ఞలక్షణం కాదు."

"ఇప్పుడు మహాపతివ్రత వగుదామనుకుంటున్నావా?"

"అవును."

"అహాహా! వావా ప - తి - వ్రి - త - వా?"

"అవును."

"పతితవు - పతివ్రితవు కాగలవా?"

"ముమ్మాటికి"

"ఓహోహో! ఏమి పాతివ్రిత్యం!"

"అనవసరంగా మాట్లాడకు మోహన్! పూర్వస్నేహంవల్ల ఈమాత్రమైనా చను విచ్చాను; మరొకరైతే ఈపాటికి ఇంట్లోనుంచి గెంటించేదానినే, తెలిసిందా?

ఆమె లేచింది. మేడమెట్లు దిగి వెళ్ళబోయింది. ఆమె రెక్క పట్టుకొని ఆపివేశాడు, ఎదురుగా ప్రళయ రుద్రునిలా నిలబడ్డాడు.

"దేవీ! ఆకలిగొన్న సర్పం కన్నదంతాన్నైనా కబళించి వేస్తుంది సుమా?"

"కావచ్చు. క్రూరజంతువు లన్నీ బిడ్డల్ని చంపి తినేవే."

"ఆకలి మానవులను సహితం క్రూరులను చేస్తుంది."

"మంచిది."

"నాకు ప్రణయ భిక్షం పెట్టి నా ఆకలి తీరుస్తే నే తీర్చావు."

"లేకపోతే."

"నీకు నాకూ గల సంబంధం అంతా చెప్పేస్తానుసుమా"

"ఎవరితోటి?" అంటూ రెండుచేతులూగా నడుము మీాద నిలిపి, కవిగా ప్రశ్నించింది.

"నీ భర్తతోటి"

"ఓహోహో! ఏం గొప్పపని? అంతమాత్రంలో నమ్మేసి, నా భర్త నా ప్రాణాలు తీసివేస్తా డనుకుంటాను. మోహాక! అలా ఉన్నవి రెండూ లేనివి రెండూ కల్పించి చెప్పటం ఆడ వాళ్ళపని. అది మగవారిపని కాదు. నీవు నన్ను బలాత్కారం చేయడానికి వచ్చావంటే లోకం నమ్ముతుంది గాని, నేను నిన్ను బలాత్కారం చేశానంటే లోకం నమ్మదు."

"నమ్మిస్తాను."

"చేతకానిపని.

"చూస్తావుగా."

"పోవోయ్ పిచ్చివాడ. ఏ కుయుక్తులు పన్నినా స్త్రీ పన్నాలిగాని పురుషు డేం పన్నగలడు? వలలు వేయటం మావంతు, వలలలో పడి ప్రాణమానాలు విడవటం మీావంతు."

"అలాగా. నీ భర్తతో చెప్పి...."

"చాలు. చాలు. కట్టిపెట్టు నీ డబ్బాయింపులు. నీవు చెప్ప వలసిన విషయా లింతకు ముందే నాభర్తతో చెప్పేశాను."

"ఆ—"

"అవును. అంతేకాదు, నీవు వ్రాసిన ఉత్తరా లన్నీ చదివి వినిపించాను. కన్నులు మండేటట్టు చూపించాను."

"చూపించావా?"

"చూపించటమే కాదు. ఆయన కన్నుల యెదుటే తగల బెట్టేశాను."

"కులటవని తెలిసీ నిన్ను కూనీ చేయ లేదూ?"

"అది నీవంటి గుండె నిబ్బరంలేని పిరికి పందలు చేసే విషయం, మోహన్! ఒక్క విషయం చెబుతా విను, రెండు చేతులూ కలిస్తేనే గాని "చప్పట్లు" కావు. పరస్త్రీ పరపురుషుడు పాల్గైతేనేగాని వ్యభిచారం కాదని ఒప్పుకుంటావా?"

"ఒప్పుకుంటాను."

"వ్యభిచారదోషం స్త్రీపురుషు లిద్దరకూ సమాన మని ఒప్పుకుంటావా లేదా?"

"ఒప్పుకుంటాను"

"అటువంటప్పుడు వ్యభిచరించిన స్త్రీని ఇంట్లో నుంచి వెళ్లగొట్టి "కులట" అని బహిష్కరిస్తారే ఆ స్త్రీతో వ్యభిచరించిన పురుషుని "కులటుడు" అని బహిష్కరించరే? ఎంచేత? స్త్రీ పతితురాలైనప్పుడు పురుషుడు "పతితుడు" కాడా? ఎంచేత? స్వార్థసంఘాన్ని శాసించేది పురుషులనా? పురుషులు బల వంతులనా? స్త్రీలు అబలలనా?"

"అయితే—"

"ఇన్నివేల పురుషులలో ఏపురుషుడు పరస్త్రీని మనసులోనైనా కామించక మనసులోనైనా వ్యభిచరించక, ఏకపత్నీ వ్రతుడుగా ఉంటాడో ఆ పురుషుని ఇలా రమ్మను. ఈ హృదయంలో గునపం దింపమను, గునపాన్ని కదిలించి రక్తాన్ని జిమ్మమను, నావేశ చెత్తుటిచే పవిత్రుల పాదాలను లత్తుకరంగు పూయమను, రమ్మను."

"——...——"

"మాట్లాడవే మోహన్!"

"——...——"

"మోహన్! ఈ తుచ్ఛలోకం దాంభికుల పాదధూళి తల ధరిస్తుంది. కుచ్ఛితుల వాక్యాలు శాసనాలుగా గ్రహిస్తుంది. అంతేగాని న్యాయాన్యాయవిచక్షణ లేదు."

పురుషులకు శిక్ష లేదు కాబట్టి స్త్రీలను వ్యభిచరించమంటావా?"

"అదేనా నాభావం? బాగా గ్రహించావే? పురుషులకు శిక్ష లేనినాడు స్త్రీలకు శిక్షపనికి రాదు. స్త్రీపురుషులిద్దరూ సమానులే. సమానగౌరవానికి సంఘంలో అర్హులే. ఎవ్వరూ అన్యులను కామించరాదు. అదే సత్పథము కాని పురుషుడు తన ఇచ్ఛ ఇచ్చినట్లు తుచ్ఛంగా వ్యభిచరిస్తూ తన భార్యకు ధర్మోపదేశాలు చేయడం ఆమెశీలాన్ని శంకించి శిక్షించడం కేవలం స్వార్థం; కేవలం దౌర్జన్యం."

"చిత్రం—చిత్రం."

"హృదయం లేకుండా మాట్లాడక. అసలు భార్యాభర్త లిద్దరూ ఒకరి నొకరు గాఢంగా ప్రేమించుకుంటున్నగాను వ్యభిచారానికి తా వెక్కడిదోయ్ వెఱ్ఱివాడ!"

"ధర్మోపదేశాలు చాలు."

"అయితే దయచేయి, దో వటు."

"తెలుసును."

"వచ్చిన దోవనే దయచేయి."

అంటూ ఆమె వేలెత్తి మార్గం చూపిస్తూఉంది.

"ఎవరు దయచేస్తారో తెలుస్తుంది." అంటూ రుద్రుడ్లాగ అతడు మేడమెట్లు దిగి వెళ్లిపోయాడు. ఆమె నిట్టూర్పు విడుస్తూ ప్రక్కమీద వాలిపోయింది.

* * *

ఆ మరునాడు సాయంకాలం - తోటలో బాదంచెట్టు క్రిందున్న పాముపుట్టమాటున మోహన్ మరొకడు గుసగుస లాడుకుంటున్నారు.

"రేపు రాత్రికే"

"రేపే."

"రేపే... రాత్రి పన్నెండుగంటలకు."

"మేడ లోపలిభాగం నాకు తెలియదే."

"నేను చూపెడతానుకదూ!"

"ఎవరిని దేవినా? వెంకటేశాన్నా?"

"వెంకటేశాన్ని మొదట చంపివేస్తే - తరువాత దేవి పని పట్టొచ్చును."

"సరే! దేవిని చంపటం నాకు వదిలివేయండి, మీరు వెంకటేశంగాడ్ని చంపేయండి."

"కోటీ! వెంకటేశాన్ని చంపటానికి నం పేయగలను."

"మరింకా భయం ఎందుకు?"

"ఏమీ లేదు."

"చెప్పండి బాబు,"

"ఆ శవాన్ని సముద్రంలో పారేయడమే ఎలాగా అని చూస్తున్నాను."

"నే నున్నానుకదు బాబు."

"నీ వొక్కడవే శవాన్ని మోసుకుపోగలవా?"

"ఇంకా ముగ్గురున్నారులెండి. నంచిలో వేసేసి పట్టుకు పోతాం."

"వారి కెంత ఇవ్వాలి!'

"ఎంతోనా? తలో ఒకవందా ఇస్తే చాలు."

"సరే తప్పుతుందా?"

"మరి డబ్బు సిద్ధంచేసుకోండి."

"డబ్బు కేమిట్లే. నా భార్య చంద్రహారా లెలాగైనే కొట్టేసి పనిచేస్తాగా?"

"తమరి దయ, వెళ్ళిరానా?"

"వెళ్లిరా! జాగ్రత సుమా!"

"ఇటువంటివి ఎన్ని జరిగాయో ఈ చేతులో."

"నాకు తెలీదటగాని, రేపు రాత్రి పన్నెండుగంటలకు అన్నీ జరిగిపోవాలి సుమా!"

"తప్పకుండా! అటు సూర్యుడు ఇటు తిరిగినా తప్పకుండా నుటండీ!"

మోహన్ ఆ కోటిగాడి చేతులో వంద రూపాయలు పెట్టాడు. వాడు వెళ్ళిపోయాడు.

"ఈ వెంకటేశంగాడిని చంపి, దేవిని నా స్వాధీనం చేసుకో లేకపోయినప్పుడు చూస్తాను. కొంపతీసి వెంకన్నకు తెలీదుకదా! వాడిదగ్గరమాత్రం మహాత్ముడిలా నటించి తీరాలి. నటనలోనే ఉంది ప్రపంచం." అనుకుంటూ మోహన్ వెళ్లిపోయాడు."

* * *

౬

"కస్తూరీ తిలకం" అంటూ ప్రసాద్ ప్రక్కింటివా రెవరో ప్రార్థన చేస్తూఉన్నారు తెల్లవారుజామున. ప్రసాద్ ప్రక్కమీద అటూఇటూ కదులుతున్నాడు. సరోజిని తలారా స్నానంచేసి, పట్టుబట్టలు కట్టుకొని, వాలుజడ వేసుకొని జడలో పూలు,తులసిదళం పెట్టుకొని, భర్తపాదాలకు నమస్కరిస్తూఉంది. ప్రసాద్ కనులు విప్పాడు: ఆమె చూడలేదు. భర్త పదములను కనులకు అద్దుకుంటూ ఉంది. ప్రసాద్ లేచి ఆమె రెండు భుజములూ పట్టుకొని ముఖంలో ముఖం పెట్టి చిరునవ్వుతో చూచాడు.

"సరోజ్! ఏమి టీ పూజ"

"ప్రేమపూజ"

"ఈకాలంలోకూడానా?"

"యుగయుగాలు గడిచినా సతికి పతిసేవకంటే కావల సిందేముంది?"

"నీవు వట్టి వెఱ్ఱిబాగులదానివి సుమా!"

"కావచ్చు. ఆ వెఱ్ఱిలోనే నాకు నిర్మలానందం"

"ఇంతసేవకు నేను అర్హుడను కాను సుమా!"

"మీకున్న అర్హత ఆ భగవంతునికికూడా లేదు చిన్న తనంలో తల్లిదండ్రులే దైవసములు; తరువాత గురువు: తరువాత భర్త. ఇప్పుడు మీరే నాకు తల్లి, దండ్రి; గురువు, దైవమూ, సమస్తమూను."

"ఏమిటి నీ మూఢభక్తి!"

"ఆనందం ఇచ్చేభక్తి ఏ భక్తి అయితేనేం?"

"మంచిది."

అంటూ ప్రసాద్ తన ప్రణయినిని దగ్గరకు తీసు కన్నాడు. ఆమె మధుర స్నేహానికి కానుకగా బిగికౌగిట బంధించాడు. ఆమె పతి కౌగిటిలో స్వర్గీయ సుఖాన్ని అనుభవిస్తూ ఉన్నది.

* * *

ఉదయం ఏడుగంట లయింది. ప్రసాద్ సరోజినులు - గోవింద్ సీతలు ఆనందంగా టిఫిన్లు తీసుకొని కాఫీ తాగు తున్నారు.

"సరోజినీ! అరవవాళ్లకంటే అద్భుతంగా తయారుచేయించావే కాఫీ" అన్నాడు ఆమెవంక చూచి నవ్వుతూ గోవింద్.

"ఆ రుచి క్లాసులో లేదు. మీ పిన్నియందుగల అభిమానంలో ఉంది. అని జవాబిచ్చింది అతనిభార్య సీత. అతని ముఖం నల్లగా కమిలిపోయింది.

"నిజానికి వాడికి వాళ్ళ పిన్నియెడల గలభక్తి అపారం" అన్నాడు ప్రసాద్.

"అపారంకాదు పారావారం." అని సీత జవాబిచ్చేసరికి అంతా గొల్లుమని నవ్వారు. గోవింద్ కూడా విషపునవ్వులు రెండు విసరివేశాడు. కాస్త్రతాగి అంతా ఆనందంతో లేచారు. నవ్వుకొనేవారు నవ్వుకుంటున్నారు. ఏడ్చేవారుఏడుస్తున్నారు.

* * * *

భోజనాలయ్యాయి. సావిట్లో కూర్చొని పళ్ళెంలో ఉన్న తమలపాకులు నలుగురూ వేసుకుంటున్నారు.

"మావయ్యగారూ! రేపు దశమి; మంచిరోజు."

"అయితే?"

"రేపు మా ప్రయాణం తప్పదుసుమా!" అంటూ ఖాయం చేస్తూఉంది సీత.

"ఇప్పుడప్పుడే తొందరేముంది?"

"లేదు మావయ్యగారు! వెళ్ళాలి; మీ అబ్బాయి గారికి నిదురెక్కువై కుంభకర్ణుని అవతారం వెలిసేటట్లు చేస్తారేమోనని భయంగా ఉంది."

"ఏమి అల్లరి చేస్తావు సీతా?"

"అల్లరి కూడానా? చూడండి, ప్రయాణం విషయం వారి కేమీ పట్టనట్లు ఎలా కూర్చున్నారో ధవళేశ్వరం రాచిప్పలాగ."

"నీ వేమిటి మహా సీమపచ్చిమిరప కాయలా గంతు లేస్తున్నావ్."

"జాగ్రత్త! విూకంట్లో కారం జల్లగలను." అంటూ విరగబడి నవ్వటం ప్రారంభించింది, దానితో మిగిలినవారు కూడా నవ్వడం ప్రారంభించారు.

ఎలాగైతేనేం కొంతవాదన అయిన తరువాత ఏకాదశి నాడు ప్రయాణం ఖాయంచేశారు. ప్రయాణం అంటే చాలు ప్రాణం పోతున్నట్లుంది గోవింద్‌కు. ఎలాగైనా వెళ్లేలోపున సరోజినిని స్వాధీనం చేసుకొని తీరా లనుకున్నాడు.

*                    *                    *

సరోజిని పూలమాల కూర్చుతూ ఉంది. నెమ్మదిగా వచ్చి ప్రక్కనే కూర్చున్నాడు. ప్రసాద్ ఇంట్లో లేడు, సీత పూజల్లోపడింది. అది మంచి సమయం అనుకున్నాడు.

"సరోజ్."

"అలా ఖంగారుగా పిలిచావే బావా!"

"ఖంగారేమీ లేదు. నీ కొకటి జ్ఞాపకం చేయాలని వచ్చాను."

"ఏమిటి?"

"మా ప్రయాణం రేపే అని మరచిపోకు."

"అవును. మీ రింత త్వరలో వెళ్ళిపోతుంటే నాకు చాలా విచారంగా ఉంది."

"నిజంగా విచారంగా ఉంది?"

"ఎందు కుండదు గోవింద్?"

"నీకలా విచారంగా ఉండడం ఎందుకో తెలుసునా?"

“ఎందుకట?”

“నాయందు గల గాఢప్రేమచే అలాగుంటుంది.” అంటూ ముఖకమలం దగ్గరకు జేరాడు. వెకిలినవ్వులునవ్వుతూ ఉన్నాడు. సరోజిని గ్రహించింది.

“బావా! మళ్ళీవస్తాను; క్రింద పదోపని ఉన్నట్లుంది.” అంటూ లేవబోయింది. ఆమెను కూర్చోపెట్టి, “సరోజ్! నీపాదాలమీద పడి ప్రార్థిస్తాను. నాకోరిక నెరవేర్చవా?”

“సరోజ్! నీ వీపూట నా కోరిక నెరవేర్చక పోతే నా ప్రాణాలు పోతాయి సుమా?”

“ప్రాణాలు పోతాయా?”

“తప్పకుండా సరోజ్.” అంటూ ఆమె చేయి పట్టుకోబోయాడు. ఆమె సర్పాన్ని విదిల్చినట్లు అతని చేయి విదిలించివైచింది.

“బావా! కన్నులున్నవానికి చీకటిలో మార్గం చూపాలంటే దీపం అవసరంగాని కన్నులు లేనివానికి దీపం ప్రయోజనం ఏముంది? గుడ్డివానికి లోకంఅంతా చీకటే.”

“అయితే నా...”

“ఇంక మాట్లాడకు. బావా! కామాంధుడవై రావణ కీచకుల మార్గంలో పోక, నా చేత నీతులు చెప్పించుకొనే అంత నీచస్థితిలోకి రాక.”

“సరోజ్! అగ్నిలో నేయిపోస్తే చల్లారదు; మరీ విస్తారం అవుతుంది. దాహంగొన్నవానికి నేయి దాహానికిస్తే, దాహం చల్లారదు; మరీ విస్తారం అవుతుంది. అలాగే క్రోవంతోపుంటే

నీ కనులు, నా కామాగ్నికి మరింత ఘృతాన్ని పోస్తున్నాయి; నీ మాటలు మరింత పిచబుద్ధి వేస్తున్నాయి."

"పాడై పోతున్నావ్."

"అవును సరోజ్! ఆకలిగొన్నవానికి అన్నం పెడితే ఆకలి తీరుతుందిగాని, ధర్మోపన్యాసం చేస్తే ఆకలి తీరదు సుమా! నాకింత ప్రణయభిక్ష పెట్టి, నా ఆకలి తీర్చు, లేకపోతే నిన్ను విడువను. చచ్చినా ప్రేతనై నీ ఇంటిముందు నిలిచి "సరోజ్! సరోజ్! ఆకలి! ఆకలి!" అని మొ[illegible] అరుస్తాను."

"బావా! నీస్థితి చూస్తే నాకు చాలాజాలి వేస్తూఉంది."

"అంచేతే నాకు "ప్రేమభిక్ష పెట్టు""

"ఆ మృత్యుదేవత నడుగు."

"నీవే నాపాలిట మృత్యుదేవతవు. నా కోర్కె తీర్చని నాడు నీ పాదాలమీదపడి ప్రాణాలు విడిచితీరతాను. ఈ రాత్రే విషం తీసుకొని, దొల్లుకుంటూవచ్చి, నీపాదాలమీదపడి ప్రాణాలు వదులుతాను."

"ఇలాగంటం న్యాయంకాదు సుమా!"

"ఏమైనా సరే!"

"పండువంటి కాపరాన్ని పాడుచేయాలనుకుంటం మహాపాపం సుమా!"

"అవుగాక అన్నిపాపాలు ఒక్క నీమధురాధరంతో సరి."

"ఛీ! ఛీ! తుచ్ఛుడా! ఊరుకో! నీభార్యే రంకుటాలైతే సహిస్తావా? నీభార్యనే నాభర్త కామించి, ఆమె యౌవనసౌందర్యాన్ని కామాగ్నిలో వేసి దగ్ధంచేస్తే ఊరుకోగలవా?"

"సరోజ్!"

"మాటలాడవేం. బలవంతంగా ఏ స్త్రీని ఎవ్వరూ వశం చేసుకోలేరు. ఒక్క కేక వేశానంటే నిన్ను ముక్కలుముక్కలు చేయించగలను. జాగ్రత్తగా నామార్గానికి అడ్డులే. స్త్రీసాహసించాలేగాని, ఈ ప్రపంచాలే గడ్డిపరకలై పోతాయి సుమా!

నేనే ఇంతన్నడూ ఏ స్త్రీకి ఇలా నీ తుచ్ఛమైన జీవితాన్ని విప్పి చూపించక."

"నామాట వినవా!"

"... ... ... ..."

"నా కోరిక తీర్చవా?"

"... ... ... ..."

ఆమె మాట్లాడకుండా వీరాంగనలా మెట్లు దిగి వెళ్ళి పోతూఉంది. అంతలో సీత ఎదురయింది.

"ఏం అత్తా! అలా కోపంగా ఉన్నావ్?"

"ఏమీ లేదు."

"అలా కళ్లెఱ్ఱబడ్డాయే?"

"ఏమీ లేదు."

ఆమె వెళ్ళిపోయింది. ఏమిటో! మేడమీద ఏమైనా అన్నాడా అనుకుంటూ మేడెక్కింది. ఆమె కన్నుల నామె నమ్మలేకపోయింది. తల రెండుచేతులతో పిసుక్కుంటూ గోవింద్ కూర్చున్నాడు.

"ఓహోహో! మీరా!"

అతడు నిర్ఘాంతపోయి చూచాడు

"మామగారేమో! అత్తగారినేమైనా అన్నారేమో, ఆమెకు కోపం వచ్చి వెళ్ళిపోయిందేమో అనుకున్నాను. మీరా? పరిభువులు."

అతని నరాలు తెగిపోతున్నట్లయ్యాయి. సర్వత్ర అవయవం గజగజా వణికిపోతున్నట్లయింది.

"మీకు కూడా దుర్బుద్ధి పుట్టిందీ! వెళ్ళి తాళిచూనా పూలదండలా మెళ్ళో వేసుకోవాలని దుర్బుద్ధి పుట్టిందా బాబు!"

"నే-నే-నేం-చెయ్యలేదు."

"ఏంచెయ్యగలరు? మీవంటివారు చెయ్యనుంటేను ఆమె కొనగోరు కదపలేరు."

"అవునవును."

"దగ్గర భార్యా ఉన్నప్పుడే తప్పుడుబుద్ధి కలిగిన మీకు ఒంటరిగా స్వేచ్ఛాకుమారులుగా ఉన్నప్పుడు చెప్పాలా? మహాశయు లెన్ని గుమ్మా లెక్కి ఎన్ని గుమ్మాలు దిగారో!"

"ఛా! ఛా!"

"ఆ వణికే మీ శరీరమే మీకు సాక్షి."

"ఇం కెప్పుడూ."

"చేయరా?"

"చేయను."

"ఇప్పుడేదో కీచకమహాచక్రవర్తిలా, తమరి తాముక హస్తాన్ని చాచా రన్నమాటేకదూ!"

"అబ్బబ్బే!"

'ఆ హస్తం ముక్కలైపోయేటట్లు ఆమె శపించలేదూ!'

"............"

"కన్నకొడుకుగా ఆదరించినందుకా ఈ మర్యాద? పినతల్లినే గనుయుబాను మీకు లోకంలో ఏ స్త్రీ వంకటూలకింద కనబడదూ? తిన్నింటికి వాసాలు లెక్కపెడతారా? పాలుతాగిన పయోధరమే పట్టుకోస్తారా? కన్నతల్లి కడుపులో పేగులే దండలుగా వేసుకుంటారా? కృతఘ్నుని మాంసం కుక్కలైనా తినవన్నా సంగతి మరచిపోయారా? లోకం అంతా విరగబడి వస్తూ ఛీ! ఛీ! అని ముఖంమీద ఉమ్మేస్తుందని మరచి పోయారా?"

"గట్టిగా అరవకే, నీకు పుణ్యం ఉంటుంది."

"అరుస్తానా, మావయ్యతో చెప్పి బుద్ధి చెప్పిస్తానా?"

"వచ్చిందిగా బుద్ధి."

"రాలేదు వచ్చినట్లు కనబడుతోంది"

"లేదే. వచ్చిందే"

"లేదండీ, రాలేదు."

"సీతా! నీ పాదాలు పట్టుకొని చెబుతాను. నాకు బుద్ధి వచ్చిందే"

"అయితే ఇంతకు ముందు బుద్ధి గడ్డితిన్నమాటేకమా!"

"అక్కా! అసలు నే నేమీ అనందే. ఏమే సరోజ్ అన్నాను చనువుకొద్దీన. "నన్ను ఏమే అంటావా? నీకు పిన్నినికాదా?" అంటూ కారాలు, మిరియాలు నూరుతూ, కళ్ళెఱ్ఱజేసి చేతమోట్లు దిగిపోతూవుంది. నాపాపం పండి ఆ సమయానికే నీవు వస్తున్నావు. అంతకు తప్పితే కాశీలో గోవును చంపినంత మహాపాపానికి గురౌతాను. శివాలయంలో బ్రాహ్మణ్ణి చంపినంత పాపానికి పాలౌతాను, తెలిసిందా?"

అతడు లేచి భార్యను ఒప్పించాలని ఇచ్చిన ఉపన్యాసం అంతా వింటూ ఉంటే ఆమెలో ఆమెకే నవ్వువచ్చింది. మగ వారి దౌర్బల్యం, ఆడేఅబద్ధాలు తెలుసుకుంటుంటే సిగ్గుకూడా వేసింది.

"ఏమిమాటలు నేర్చారండీ! తాడిచెట్టు ఎందు కెక్కావంటే దూడ గడ్డికోసం అన్నట్టు, ఒంటరిగాఉన్న యువతితో మాటలేమిటండీ అంటే ధర్మోపన్యాసా లిస్తున్నా రేమిటి, నా తలకాయ్."

"ఏదో అయిపోయిందేదో అయిపోయింది. ఇకనుంచి సరిగా లేకపోతే అడుగు."

"అడిగితే ఏంలాభం- అడక్కపోతే ఏంలాభంటండీ."

"చూస్తావుగా"

అంటూ మేడమెట్లు దిగుతున్నాడు బెదురు బెదురుగా.

"జారిపోతున్నారు. పల్లానికి జారే నీటిలాగ"

"అబ్బబ్బే"

మెట్లు దిగి ఒక్క క్షణంకూడా యింటిలో ఉండక ఎవరి మొఖం చూడలేక షికారు బయలుదేరినట్లు బజారు పోయాడు.

"రామరామ! ఇంక ఆ భార్యాభర్తల ముఖం చూడడం ఎలా? ప్రాణానికి ప్రాణంగాచూచిన మావయ్యకు ఈ సంగతి తెలుస్తే ఇంకేమైనా ఉందా? ఇంతకూ తిన్నతిండి వంటబట్టకపోతేసరి ఇటువంటికాముకకృత్యాలకు లోబడతారు. కారం ఉప్పూ పులుసూ తినని అరవవాళ్ళను చూడండి, కామ, కోప, క్రోధా లుంటాయేమో. చలికాలం నీటికుండలా

సుంటారు. ఇకనుంచి నేనూ తగ్గిస్తా ఉప్పూ కారాలు" అంటూ మెదమెట్లు దిగింది. ముల్లు ఆకుమీద పడినా, ఆకు ముల్లుమీద పడినా, నష్టం ఆకుకేకదా! దుర్జనులపక్క సజ్జనులుంటే నష్టం సజ్జనులకే కదూ! అందుచేతే "దుర్జనమైత్రి కూడదు" అన్నారు.

* * *

## ౨

కారుచీకటి నాలుగుమూలలా వ్యాపించింది. మోహన్ కనుబొమలు నల్లత్రాచుల్లాగ ముడతలుపడుతున్నాయ్. త్రాచుపాము నాల్కల్లాగ కళ్ళు ఎఱ్ఱగా మెరిసిపోతున్నాయ్. అతనికి ప్రపంచం అంతా ఒక శ్మశానంక్రింద కనబడుతూఉంది. మానవులంతా కదిలేశవాలలాగ కనబడుతూఉన్నారు. శవాల మాంసం తినే నక్కలాగ తాను లోకాన్నంతా కలయజూస్తున్నాడు.

రాత్రి పదకొండుగంటలయింది. పగలల్లా పాటుపడి అలసిపోయిన ప్రజలు, చీకటి దుప్పటి ఒళ్ళంతా కప్పుకొని గాఢంగా నిదరపోతున్నారు. ప్రకృతే శాంతిగా సమాధిలో శాశ్వత నిద్రపోయే ప్రాణిలాగుంది. తోటలోఉన్న ముసలి రావిచెట్టుక్రింద మోహన్ మిగిలినవాళ్లు మాటాడుతున్నారు.

"కనుకీ! వాణ్ణి చంపటానికి ఇంకా ఒకగంట ఆలస్యముందీ?"

"అంతే"

పోయాడు. వాడు మోహానుని తీసిపెట్టి ఒక్క లెంపకాయ కొట్టాడు. మోహాన్ కళ్లు జిమ్ముమన్నాయ్.

ప్రపంచం అంతా గాలిపటంలాగ తేలిపోతూ ఉంది.

“ఓరి దుర్మార్గుల్లారా! పాముకి పాలుపోశానే! సరే. ఇప్పుడు వీళ్ళనేమీ అనకూడదు. వెంకటేశంగాడి వధానంతరం దేవిని నాలుగు చెరువులు నీళ్ళు తాగించి, వీళ్ళని నల్భై చెరువుల నీళ్లు తాగించాలి.” అనుకుంటూ ఉన్నాడు.

అంతలో టంగ టంగ్‌మని పన్నెండుగంటలు కొట్టారు.

“కోటీ లే లే. పన్నెండు కొట్టారు.”

“కొట్టనీయ్. నాకే”

“మరి నువ్వు రావా?”

“నువ్వు పద”

“కోటీ రావా?”

అతను సంశయుడుగ్గా ప్రశ్నించాడు.

“ముందు నువ్వు పదవోయ్.”

“తరువాత వస్తావా?”

“ఆఁ”

“… … … …”

‘ఆ శవాన్నిలా పారేయ్. మేం సముద్రంలోకి ఈడ్చేస్తాం’

“తప్పకూడదుసుమా!”

“ఛా! ఛా! ఇటువంటివెన్ని చూశానో”

“రా మరి”

“పద పద”

* * *

ఆ త్రాగుబోతులందరినీ మేడ దొడ్డి త్రోవనద్ద నిల పెట్టాడు. మోహన్ ఒక్కడే మారక స్త్రాని తీసుకొని వెంక టేశాన్ని చంపుదామని బయలు దేరాడు. మేడ మెట్లెక్కుతూ ఉంటే అతని హృదయం 'దప్ దప్ మని కొట్టుకుంటూఉంది. అతని కాళ్ళు రెండు పర్వతాల్లాగ కదలడం లేదు. అతనిలో ఉన్న సుబుద్ధి ఇలాబోధించింది. "మోహన్! స్వామిద్రోహం! మహాపాపంసుమా! నమ్మినవానిని నాశనంచేసేదానికంటే దుర్మార్గం మరొకటుండదు. కామక్రోధాది అంతశ్శత్రువు లను జయించినవాడే మానవుడు, వానికి లొంగినవాడు కేవలం పశువేసుమా!

అత డులుక్కుపడ్డాడు. కనులయెదుట ధర్మదేవత వణు కుతూ ఉపదేశం చేస్తూఉంది.

"మోహన్! ఆలోచించకు, వెనక్కు వెళ్ళిపో. త్రాగు బోతులు నీకు ఆత్మబంధువులు కారు. దేవి నీకు చేసిన అప కారం ఏమీలేదు. పతి పదసేవ చేస్తానన్నా సతి పాదాలకు మొక్కటానికిబదులు పట్టి చంపడం ధర్మంకాదు, వెంకటేశం అతి సాధువు. ఇతరుల కపకారంచేయలేని గంగగోవు. అతడు ని న్నెప్పుడైనా పన్నెత్తు మాటన్నాడా! మోహన్! దేవి నీకు అపకారం చేయవచ్చును. నీఆనందాన్ని చిదిమివేయవచ్చును. నీ ఆశను తుంచివేయవచ్చును, నీకు శత్రువు కావచ్చును. శత్రువునైనా శిక్షించక, క్షమిస్తే ఔన్నత్యంగాని గొంతునులిపి ప్రాణాలు తీయడం నీ ఔన్నత్యానికికాదు. నీ వినాశనానికి శత్రువులను మిత్రులను సమానంగా చూచినవాడే మహా త్ముడు. తెలిసిందా మోహన్! అటువంటప్పుడు దేవిమీద

కోపం ఏ పాపం ఎరుగని వెంకటేశంమీద చూపించాలను కుంటున్నావంటే ఏమనాలి? ఎంతనీచం? వెళ్ళు వెళ్ళు. వెనక్కి వెళ్ళు. నూరాతాళి చెప్పుకోక. నరకాగ్నిలో మునుగక. "సాక్షి" "సాక్షి" "సాక్షి" అని నలుగురిచేత అనిపించుకోక. వెళ్ళు వెళ్ళు. భగవంతుని నా శిక్షకి గురికాక."

అంతర్ధానంచేసే ఆ ప్రబోధం వింటూఉంటే అతని శరీరం అంతా, తెగిపోయిన గాలిపటంగ ఎదురుగాలిలో కొట్టుకు పోతున్నట్లు, వణికిపోయింది. తల రెండుచేతులతో పట్టి పీకేసుకున్నాడు. చేతులు వణికిపోతున్నాయి. చేతిలో కత్తి జారిపోతూఉంది. మేడమెట్లు ఎక్కలేకపోతూన్నాడు.

"ఛీ! ఛీ! కాముకుడనై వెధవపాపపుపని చేయలేను. నలుగురిచేత "సాక్షి, సాక్షి" అని పిలిపించుకోలేను" అనుకుంటూ మెట్లు దిగిపోయాడు. అంతలో ద్వారంవద్ద వేచిఉన్న ఆంబోతులు జ్ఞాపకం వచ్చారు. నిలబడిపోయాడు.

తరువాత మేడమీద తనను పరాభవిస్తున్న దేవి జ్ఞాపకం వచ్చింది. ఉలుక్కిపడ్డాడు. ఆమె నిలబడి గేవిగా వేలెత్తి మార్గం చూపుతూ అన్నమాటలు స్మరణకొచ్చాయి.

"ధర్మోపదేశాలు చాలు."

"అయితే దయచేయి. దోవటు"

"తెలుసును."

"వచ్చినదోవనే దయచేయి."

, అంటూ ఆమె వేలెత్తి మార్గం చూపించుతూఉంటే "ఎవరు దయచేస్తారో తెలుస్తుంది." అని ప్రతిజ్ఞచేసి వెళ్ళిపోయాడు. ఆ ప్రతిజ్ఞ జ్ఞాపకం వచ్చింది.

"ఛీ! ఛీ! ఆడదానికి జడిసినటువా! ప్రతిజ్ఞ నెరవేర్చుకోవాలి. ప్రాణాలు పోయినాసరే, ప్రతిజ్ఞాపాలనమే క్షత్రియ లక్షణం." అనుకుంటూ బయలుదేరాడు.

"హంతకుడవు కాక భగవానుని వాత్సల్యానికి గురికాక. 'పాపీ'—'పాపీ'—'పాపీ' అని నలుగురిచేత తిట్టించుకోక." అంటూ సద్బుద్ధిచేసే బోధకు ఒకమెట్టు తిరిగి వెనక్కు వేశాడు.

"మోహన్! ఏమిటి నీ అధైర్యం! దౌర్బల్యం పురుష లక్షణం కాదుసుమా! కర్మవీరుడవు కమ్ము, బంధువులను చంపలేని అర్జునునివలె పిరికిపందవు కావలదు.

"కర్మణ్యేవాధికారస్తే
మాఫలేషు కదాచన."

అన్నట్లు కర్మ చేయుటకే నీకు అధికారం ఉన్నదికాని, ఫలం కోరటానికి అధికారం లేదు. వెళ్లు. చంపి నీ ప్రతిజ్ఞను పాలించుకో. తరువాత ఫలితానికి నీవు లెక్క చేయరాదు. ఎందుకంటే-

'సమదుఃఖ సుఖం ధీరం, సోఽమృతత్వాయ కల్పతే.'

అని భగవద్గీతే చెబుతూఉంది- సుఖదుఃఖాలను సమంగా చూచే ధీరుడు మోక్షం పొందుతాడని. కాబట్టి శత్రువధ వల్ల వచ్చిన సుఖానికిగాని, వానికి కలిగిన దుఃఖానికిగాని నీవు కలత చెందకూడదు. లే-లే- నీ తల్లి పిరికిపాలతో పెంచ లేదు. కర్మవీరుడవు కమ్ము." అంటూ తనలోని దుష్టబుద్ధి ప్రేరేపించింది. అతని రక్తాన్ని ఉద్రిక్తంచేసింది. వెంటనే కత్తి పుచ్చుకు బయలుదేరాడు.

* * *

మేడమెట్లెక్కాడు. "హంతకుడవు కాక." అని తనలోని సుబుద్ధి బోధించింది. గడగడలాడి పోయాడు.

"కం ఘాతయతి—హన్తి కమ్.

"చంపేదెవరు? చచ్చేదెవరు? ఈబోధే అర్జునునకు కృష్ణుడు బోధించింది. వెళ్ళిచంపేయ్. దౌర్బల్యం పనికిరాదు. అంటూ తనలోని దుష్టబుద్ధి నొక్కిచెప్పింది.

* * *

మహోత్తరమైన భగవద్గీతోపదేశాలను తుచ్ఛంగా చేసి తనకు అనుగుణంగా బోధచేసిన దుర్బుద్ధికి మోహన్ లొంగి పోయాడు. కత్తి పుచ్చుకొని మేడెక్కాడు. వెంకటేశం ఒక మంచం మీద దేవి మరొక మంచంమీద నిదురపోతున్నారు గాఢంగా. అదే సమయం అనుకున్నాడు. కొద్దికాంతి నిచ్చే ఎలక్ట్రిక్ లైటును (Dim bed room light) స్విచ్చి నొక్కి ఆరిపి వేశాడు. ముఖం అవలకు తిప్పి ఒక్కవేటులో చంపి వేయాలని కత్తి ఎత్తాడు. కత్తి గొంతుకలో దించబోయాడు. అంతే. అతని చేయమీద ఎవరివో బలవంతంగా రెండు చేతులు పడ్డాయి. కత్తి లాగేశారు. ధన్ మని నేలమీద పడిపోయాడు.

అప్పటికప్పుడు దేవి లేచితన ప్రక్కనే ఉన్న ఎలక్ట్రిక్ స్విచ్ వేసింది. గదంతా వెలుతురు మయమై పోయింది. వెంకటేశం భయంతో లేచాడు. వెంకటేశం మంచం ప్రక్కనే మోహన్ గుండెమీద పర్వతంలా కూర్చున్నాడొకడు. ప్రక్కనే నేలమీద పదును గల కసాయికత్తి పడిపోయి ఉన్నది. వాళ్లు ఆశ్చర్య పోయారు. ఎవరది? మోహన్ గుండెపై

సింహంలా కూర్చున్న దెవరు? ఇంకెవరు? నమ్మిన బంటు— వంటవాడు వెంకన్న.

“వెంకన్నా!” అంటూ దేవి గారు లేవతీశారు వెంకన్నను.

“మోహన్!” అంటూ దేవి లేవతీసింది మోహనుని. మోహన్ తల వంగిపోయింది వంగిపోయినతల పాతాళలోకం లోకి సిగ్గుతో కుంగిపోయింది. కుంగిపోయిన తల నే ధర్మ దేవత లేవగలదు? ఒకరిముఖం మరొకరు చూచుకుంటూ నోట మాటలేక మిగిలిన ముగ్గురూ కొన్ని నిముషాలు స్తబ్ధులై పోయారు. దేవి వెంకన్నవైపు తిరిగింది.

“వెంకన్నా! ఏం జరిగింది?”

“హత్య ఆపుచేయడం జరిగిందమ్మా!”

“ఎవరి హత్య!”

“బాబుగారి హత్య!”

“ఆకస్మిక త్తి చేతేనా?”

“అవును.”

“అంతపుణ్యం తలపెట్టింది నా ప్రియమిత్రుడు మోహనేనా?”

“———...———”

“మాట్లాడవే వెంకన్నా?”

“ఆ బాబుగారినే అడగండి, తల్లీ!”

“ఏం మోహన్ ... హంతకుడవు కాబోయింది నీవేనా?

“———...———”

"హత్యచేయడానికేనా ఈకసాయి కత్తి తీసుకొచ్చింది?"

"______ . . . ______".

మోహన్ శిలలాగైపోయాడు. అతని కన్నులలో వెలుగు తొలగిపోయింది. అతని శరీరంఅంతా ముచ్చెమటలు పోశాయి. పెదవులు ఎండిపోయాయి. అలా వణికిపోతున్న మోహన్ దగ్గరికి వచ్చి భుజంమీద చేయివేసి, ప్రేమరసం పొంగిపోతూ ఉంటే "బా... బూ!" అంటూ పిలిచాడు వెంకటేశం.

మోహన్ జవాబు చెప్పలేక పోయాడు. "బాబూ! ఈ సామాన్యుని చంపడానికి ఇంత ప్రయత్నం ఎందుకు? నన్ను చంపాలంటే అగ్ఘశాస్త్రి కావాలా? ఇంత భయం ఎందుకు బాబూ?... అయినా మోహన్! నన్ను చంపడానికి నీ వింత శ్రమపడ గావాలా? నన్ను రమ్మంటే నీయిష్టంవచ్చిన చోటికి రాను బాబూ!" అంటూ ప్రేమతో- జాలితో- అంటుంటే మోహన్ మరింత నరకబడిన మ్రాను అయిపోయాడు.

"మోహన్! పాపం! నీ కెంత కష్టం కలిగించిఉంటానో! ఎంతకష్టం కలిగించకపోతే, నన్నింత శ్రమపడి చంపాలనుకుంటావ్ చెప్పు..."

"శ్రమా?"

"మోహన్! ఇప్పటికే మించి పోయిందేమీ లేదు—నీ యిష్టం వచ్చిన చోటుకు వస్తాను. నా ముసలితల మొండెం నుంచి వేరుచెయ్యి,... ఒక ప్రాణికైనా ఆనందం కలిగించ కలిగానంటే, అంతకంటే కావలసిందేముంది? లేబాబు. లే. నీ ప్రయత్నంలో నీవు వుండు. విచారించక. ఇంతలో మించి

పోయిందేమీ లేదు." అంటూ అతిశాంతంగా మహాత్మునిలా అంటున్న వెంకటేశం మాటలు వింటుంటే, మోహన్ కన్నుల నీరు జారకుండా ఉండలేకపోయాయి. అంతలో వెంకన్న వారికి మధ్య వచ్చాడు.

"బాబూ! రాతివంటి హృదయం కరిగిందా, కన్నీరు కారుతూ వుంది? ఇప్పటికైనా మీ హృదయంలో పవిత్ర జ్యోతిని వెలగనీయండి, మీ సతి పాలభాగం పవిత్రకుంకుమచే ప్రకాశింపనీయండి, పాడు రక్తంచే బొట్టుపెట్టకండి... బ్రతికే నాలుగు నాళ్ళైనా కనులలో విజ్ఞాన దీపం వెలిగించండి. బాబూ! చూచారా! వెంకటేశంగారి శాంతం—తండ్రి కంఠంపై కత్తినెత్తారు—లేవండి. అయనను క్షమాభిక్ష వేడుకోండి— క్షమిస్తారు — క్షమా పూర్ణంకాని మహాత్ముని హృదయమే ఉండదు."

వెంకన్న మాటలు వింటూవుంటే అతడు వెఱ్ఱివాడై పోయాడు. వెంటనే వెంకన్న రెండుపాదాలమీందా పడి పాదాలను రెండుచేతులతో బిగించి; కన్నుల కద్దుకున్నాడు—ఆ పాదాలపైనే రెండు వేడి కన్నీటిబిందువులు విడిచాడు.

వెంకన్న ఆతని పరిదగ్ధ హృదయం చూస్తుంటే కన్నీళ్ళు కార్చకుండా వుండలేకపోయాడు. కారే కన్నీటితో ఆతడ్ని లేవదీశాడు.

"మోహన్ బాబూ—ఇవి మహా పాపి పాదాలు. ముట్టుకోకండి—అవిగో పవిత్రపాదాలు—"అంటూ వెంకటేశం పాదాలు చూపాడు.

"వెంకన్నా! శతసహస్ర యోజనాల దూరం పాతాళ గహ్వరంలోకి ఈడ్చుకుపోతున్న నాపాప పిశాచాన్ని మొదలంట కూలవేసిన మహాత్ముడవు నీవు—నీ పాదాలే నాకు స్వర్గమందిరాలు. ఇక వెంకటేశం దేవిగార్ల విషయం—వారిని క్షమించమని ప్రార్థించలేను. వారు నన్ను క్షమించినా నేను క్షమార్హుడను కాను. నాప్రాణాలు తీసుకున్నా నా పాపం శాంతించదు. ఎన్ని జన్మలవరకో కట్టి కుడుపుతుంది." అంటూ దేవి ముఖం చూచాడు. దేవి తల వంచుకుంది. వారిద్దరి కన్నులలో మూగ రహస్యాలు వారిద్దరికీ తప్ప మరెవరికీ అర్థం కావటంలేదు.

"ఎవరివల్ల నాశనంఅయ్యానో, వారివల్లే నేను వచ్చే జన్మలోనైనా బాగుపడగలను. ఏ పాపపు ద్వారాలనుంచి నరకాగ్ని మధ్యంలో దూకానో, ఆ పాపపు ద్వారాలనుంచే స్వర్గవనంలో సింహాసనం ఏర్పరచుకున్నాను. వెంకన్నా! తండ్రిలా నాకు ఉపదేశించిన ధర్మాలు వింటుంటే నీలా నేను ధర్మప్రవర్తకుడను కావాలనుకొనేవాడిని. తండ్రిలేని నాకు నీవే తండ్రివని చూచుకుంటూ, మహాత్ములు పోయే మార్గాలలో పోదాం అనుకున్నాను. కాని... నాపాప పిశాచం నాతలమీద చిందులు తొక్కింది. సద్భావనల నన్నిటిని తన పాదాలక్రింద వేసిచిదకొట్టింది, సద్బుద్ధిని వెనుకకు నెట్టి దుష్టబుద్ధి నాచేయి పట్టుకొని నన్నీపాపపురంగంలోనికి ఈడ్చుకు వచ్చింది. కాని జరిగినవి, జరగబోవునవి గ్రహించగల మహాత్ముడవు, నాపాపవనమునకు గొడ్డలిపెట్టు వయ్యావు.

నీ కిదే నాకడసారి నమస్కారములు. నాతల నిప్పుడే దేవి పవిత్ర పాదాలకు నైవేద్యం చేయనీయండి.''

అంటూ ఒక క్షణంలో కత్తితీసుకొని తన గుండెలో పొడుచుకోబోయాడు. వెంటనే దేవి చేయిపట్టుకొని చేతిలో కత్తి లాగివేసింది.

''మోహన్! ఏమి పనిది?''

''చావనీయక, బ్రతకనీయక, నన్ను ప్రేతను చేయకు దేవీ!''

''మోహన్! నిన్ను లేనిపోని మాటలన్నది నేను; శిక్షకు అర్హురాలను నేను. కావాలంటే నన్ను చంపండి.''

అంటుంటే పెద్దనవ్వు నవ్వుతూ వెంకటేశం ఆ కత్తి తీసుకొని పెట్టిలో పెట్టి తాళంవేసి వచ్చి వాళ్ళమధ్య నిలబడ్డాడు.

''మోహన్! ఇదా సంగతి! ఇప్పుడు తెలిసింది. మీ అన్నా చెల్లెండ్రు దెబ్బలాడుకొని మధ్య 'బావయ్య' పని పడదా మనుకున్నారా? బలేదొడ్డవాళ్ళు. మోహన్! మీ చెల్లెలు తెలిసో తెలియకో అన్న రెండుమాటలు సహించలేవు బాబూ! దాని కింత గందరగోళాలా? చాలు. చాలు. ఊరుకోండి. పరాయి చెవికి వినబడనీయకండి.'' అని నిష్కల్మషంగా అంటుంటే వెంకన్న అందుకున్నాడు.

''అవును, బాబు అవును. పరాయి చెవికి వినబడనీయకూడదు. అసలు గోడలకు చెవులుండే రోజు లివి. గోటితో పోయేదాన్ని గొడ్డలితో నరకా లనుకున్నారు.''

అంటుంటే "అంతే అంతే" అంటూ వెంకటేశం సమాధానం చెప్పేశాడు.

వాకిలాంగ గడబిడ వుతుంటే అప్పుడే నిదర్లోనుంచి లేచి - "ఎవరబ్బా! అర్ధరాత్రి వేళ మేడమీద మాట్లాడుకుంటున్నారు. ఏదోంగైనా ఇంట్లో కన్నం వేయ లేదుకదా!" అనుకుంటూ దమయంతి మేడమీదకు వెళ్ళింది. వాళ్లనలుగురినీ చూచి ఆశ్చర్యపడింది. వారామెను చూచి స్తబ్ధులైపోయారు.

"అన్నయ్యా! ఏమిటీ గడిబిడ! ఎవరన్నా దొంగలు పడ్డారా?"

"లేదమ్మా!"

"లేదుకదా!" అంటూ ఆమె మెడ తడుముకొని చూచింది. చంద్రహారాలు లేవు.

"అన్నయ్యోయ్! దొంగ పడలేదంటావేమిటి? వాడి తలపండుపగల, నాచంద్రహారం ఎత్తుకు పోతే. అయ్యయ్యో! చూడండరా! చూడండి! ఆ దొంగముండాకొడుకును పట్టుకొని కట్టేసి, రెక్కలు విరక్కొట్టేయండి."

అంటూ ఖంగారుతో పరుగెట్టబోయింది.

"చెల్లీ? ఆగాగు. చంద్రహారాలు లేవూ?"

"లేందే"

"దొంగా!"

"అవునండి. ఆ దొంగను నేనే. నేనే ఆ చంద్రహారాలు తీసింది." అంటూ నిజం చెప్పగలిగినంత స్థితిలోకి వచ్చేశాడు మోహన్. వాళ్లంతా ఆశ్చర్యపోయారు.

వెంకన్నా వెంకటేశం అత డెందుకు దొంగిలించాడో తెలుసుకున్నారు. వెంకన్న వెంకటేశంచెవిలో ఏదో చెప్పాడు. దానితో వెంకటేశం ఇలా అన్నాడు.

"చెల్లీ! భయపడకు. మీఆయన ఆ చంద్రహారం తీసి నాకే ఇచ్చాడు. నే నొక స్నేహితునికి ఇచ్చాను."

"ఎందు కిచ్చావ్?"

"స్నేహితుని తాలూకు పెళ్ళికి వెళ్ళాడు.

"అయితే రేపు మా ప్రయాణం ఎలా?"

"నేను ఇస్తానుకదూ!"

"నాతో చెప్పి తీసుకోకూడదూ!"

"నీ నిద్దరమత్తు ఎంతవరకు ఉన్నదో చూద్దామని బావే అలా చేశాడు."

"బాగానేఉంది." అంటూఉంటే "లేను. నేనేతీశా" నని ఎక్కడ చెబుతాడో అని వెంకన్న మోహానుని క్రిందకు తీసుకువెళ్ళాడు. వాళ్ళ ముగ్గురూ మంచంమీద కూర్చున్నారు. అయిదు నిమషా లయ్యాయి. దమయంతి కనుకే పాట్లింకా వదలలేదు.

"చెల్లీ! క్రిందకు వెళ్ళి పడుకో!"

"సరేగాని అన్నయ్యా! మీ రంతా ఇలా జేరారేం!"

"ఒక పాము ఈ గదిలోకి వచ్చింది."

"పామే."

"మరేమి టనుకున్నావ్!"

"అయ్యోబాబు! చంపేశారా?"

"ఆఁ చంపి బయట పారేశాం."

“ఎంత దరిద్రపు వేళ!”

“అలాగేమరి.”

మరో పదినిమషాలు గడిచాయ్.

“వెళ్లు చెల్లీ! వెళ్ళి పడుకో!”

“రేపు నాచంద్రహారం మరచిపోకూడదుసుమా!”

“తప్పక.”

ఏచింతా చిహ్నమూ లేకుండా క్రింద గదిలోకి వెళ్ళి మంచంమీద ఆ సన్ననిశరీరం జారేసింది నాలుగునిమషాల కల్లా గురక వినబడింది.

“దేవీ!”

“ఎంత గణ్ణం తప్పింది.”

“మానవ జీవితానికి దినదినం గణ్ణాలే కదా!”

“మళ్ళీ ఏప్రమాదం జరగదు కదా!”

“అంతా భగవంతునిదయ. మనలో ఏముంది దేవీ!”

‘నిజం. భగవంతుడే వెంకన్న రూపంలో వచ్చి మనలను రక్షించాడు.’

“అవునవును. అయినా దేవీ! వెంకన్నను సామాన్యపు వంటవానిగా అనుకోకు.”

“నిజమే. ఏదో బ్రతికి చెడ్డవానిలా కనబడుతున్నాడు.”

“అంతేకాదు. ఒకోసారి అతని మాటలు వింటూ ఉంటే మనకే క్రొత్తక్రొత్త పాఠాలు లాగుంటాయ్. అతని హృదయంలో ఏదోబాధ కదలని పర్వతం లాగుంది. ఏదో బాధాశల్యం అతని హృదయంలో తీవ్రంగా నాటిఉంది. అది

'కదిలి నప్పు డల్లా అతను బాధ భరించ లేక కన్నీరు కారుస్తూ ఉంటాడు.''

"అలాగా!"

"ఎన్నో సార్లతను ఏకాంతంగా కన్నీరు కారుస్తుంటే నేను చూచాను. "ఏమిటిది వెంకన్నా" అంటే "ఏముంది బాబయ్యా! నేను నడిచేది ముళ్ళబాట! నే నుండేది చీకటికొంప నేను తాగేది కన్నీరు. నేను ఆడుకొనేది పిశాచాలతో." అంటూ ఎంతో విరాగిలా మాట్లాడే వాడు."

"ఏమిటే. అంత గొప్పవాడా?"

"అతని గొప్పతనం తెలుసుకుంటానికి మనం ఎంత వాళ్ళం దేవీ! సముద్రం అడుగునే రత్నా లుంటాయి. పేద వారి హృదయాలలోనే అమూల్యభావా లుంటాయ్. ఒక నాడు "వెంకన్నా! నీ జీవితం అంతా ఏడ్చి వేస్తున్నావే?" అని అంటే బాబయ్యా? కొందరి జీవితాల్లో వెన్నెల నవ్వుతుంది! కొందరి జీవితాల్లో చీకటిపడుతుంది; కొందరి జీవితాలు నవ్వేస్తారు, కొందరి జీవితాలు ఏడ్చేస్తారు. అన్నిరకాలుంటే నేగాని సృష్టిలో అందం ఏముందండి? బాబయ్యా! ప్రపంచం అంతా భగవానుని వస్తు ప్రదర్శనశాల కదండీ దానిలో అనేకజాతులవస్తువు లుంటేనేకదూ అందం?" అంటూ మహాత్మునిలా చెప్పాడు."

'అతడు మహాత్ముడే"

"మరొకరోజు మే మిద్దరం పూజకై దేవాలయానికి వెళ్ళాం. పూజారి మాలభక్తుని లోనికి రానీయక తలుపులు వేశాడు. ఆయనతో వెంకన్న ఎంత చక్కగా అన్నా డను

న్నాన్ — "మహాశయా! మాలలుమాత్రం మనలా మనుష్యులు కారా? మనలను కోస్తే పాలు వాళ్ళను కోస్తే రక్తం కారుతుందా? వారికన్నా చావుపుట్టుకలు మనకు లేవా? వారి ఇళ్ళపై సూర్యచంద్రాదులు వెలుతురుచూపరా? వాన కురియదా? వారి భూములు పంటలు పండవా? ప్రపంచం అందరికీ ఒక్కడైన భగవానుని వారుమాత్రం సేవించరాదా? ఎందు కండీ ఈ న్యాగం? ఎందుకండీ ఈ దురభిమానం? ఎందుకండీ ఈ కాఠిన్యం? బిడ్డలుకన్న మీకే జాలి లేదా? 'జాలే' కదా మానవుని మంచిని కొలిచేసాధనం?" అంటూ ఉంటే అతని కన్నులు కరుణాసముద్రాలయ్యాయ్. ఆ కన్నీటి సముద్ర మధ్యంలోనే శ్రీ విష్ణువు శేషపాన్పు మీద పవళించుతాడని అనుకోనివా రెవరు దేవీ!

అతనిలోతు గుండెలో రక్తపుపేగులు చేసే నిర్మల పూజ దేవతలుతప్ప మానవులు చూడలేరు. అతని హృదయ మంటపంలో ధర్మదేవత చేసుకొనే తులసిపూజ, విష్ణువు తప్ప మరొకరు చూడలేరు. అతని కన్నులలో వెలిగే విజ్ఞాన దీపికలను యోగులుతప్ప భోగులు చూడలేరు. అతనిమాటలు ప్రేమోపాసకులుతప్ప కాముకులు వినలేరు. అసలు దేవీ! ప్రపంచాన్ని మరచి అతడు దీర్ఘంగా ఆలోచించునప్పుడు, అతని ముఖమే ఏదో తేజోబింబంలా గుంటుంది."

"అటువంటి మహానుభావుని వంటలవానిగా పని చేయించుకుంటున్నామంటే, మనకంటె పాపు లుంటారా?"

"దేవీ! నిజమే. కాని మరొకవిషయం. అతడు మహానుభావుడని కాళ్ళమీద పడి నమస్కరిద్దామంటే అతడు ఒప్పు

కొడుకదా! నే నిలాగే "నటలు నేటినుంచి చేయవద్దు" అంటె "చచ్చేవరకూ సోమరులుగాక, ఏదో పని చెయ్యాలి బాబయ్యా" అంటూ చేస్తుంటె ఏంచెయ్యను?

"అసాధ్యుడే".

"నిజమైన సాధువులంతా అంతే."

వారలా వెంకన్నగురించి చెప్పుకుంటున్నారు. వెంకన్న మోహనుని తనగదిలోకి తీసుకువెళ్ళి పుత్రవాత్సల్యం ఒలికిపోయేట్లు కన్న కొడుకు తండ్రి బోధించినట్లుగా ఏవో బోధిస్తూ ఉన్నాడు. త్రాగుబోతులు మోహన్ మేనక్క గానే తూలుకొంటూ వారి దోవను వారు పోయారు. ఎలాగైతేనేం! విషాదమేఘాలు పోయాయ్.

*　　　*　　　*

౮

ఆనాడేకాదశి. ఆ రైల్వేస్టేషన్ వద్ద జనం గుంపులు గుంపులుగా జేరారు. కూలీలు మోయలేనిబరువులు మోస్తున్నారు. భిక్షుకులు కానులిచ్చేవరకూ విడువని ఓపికతో గొప్పవారి వెనుక పరిగెడుతున్నారు. పూలమ్మేవారు పూలమ్ముతున్నారు. పళ్ళమ్మేవారు పళ్ళమ్ముతున్నారు. అరవవాని కాఫీహోటలుచుట్టూ గద్దల్లా మూగారు ఆంధ్రులు. స్టేషన్ ముందు కారాగింది. సరోజ్ ప్రసాదులు - సీతా గోవిందుల సాగనంపటానికి స్టేషనుకు వచ్చారు. ప్రసాద్ వారికి టిక్కెట్లు కొన్నాడు. వారు నవ్వుకుంటూ నిర్మల మనస్సులతో ప్లేట్ ఫారంవద్దకు వెళ్ళారు..

అంతలో మరో కా రాగింది దేవి వెంకటేశులు - దమయంతీ మోహనులను సాగనంపటానికి స్టేషనుకు వచ్చారు. వెంకటేశం వారికి టిక్కెట్లు కొన్నాడు. వారానందంతో అనురాగ హృదయాలతో ప్లేట్‌ఫారంవద్దకు వెళ్లారు. ఆ రెండు జంటలూ అటునుంచి వస్తున్నారు. ఈ రెండుజంటలు ఇటు నుంచి వెళుతున్నారు. ఆ ప్లాట్‌ఫారంమీద ఆ నాలుగు జంటలు ఆశ్చర్యంగా కలుసుకున్నారు. వారి కలయికకు ఆ స్టేషన్‌కే ఒక క్రొత్త శోభ నిచ్చింది. నలుగురూ వింతగా చూస్తున్నా రా నాలుగుజంటలను.

"ఓహో! దేవి! అక్కయ్యా" అంటూ ఆప్యాయంగా దేవి చేయి పట్టుకుంది సరోజిని.

"చెల్లీ! సరోజ్!" అంటూ ఆనందంగా సరోజిని చేయి పట్టుకుంది దేవి!

"హలో! ప్రసాద్!"

"హలో! మిస్టర్ వెంకటేశం!"

అంటూ ప్రసాద్ వెంకటేశులు షేక్‌హేండ్స్ ఇచ్చుకున్నారు. దేవి వారికి మోహన్ దమయంతులను ఎరుక పరచింది. సరోజిని సీతా గోవిందులను ఎరుకపరచింది. ఒకరి కొకరు అభినందనాలు చేసుకున్నారు. ఆనందంతో మాట్లాడుకున్నారు.

* * *

ట్రయిను పొగలు కక్కుకుంటూ, కూలివానిలావచ్చి ప్లేట్‌ఫారంవద్ద నిలబడింది. దమయంతీ మోహనులు - సీతా

గోవిందులు అంతా ఒకే 'ఇంటర్ కంపార్టుమెంట్‌లో' ఎక్కారు. ట్రయిను కదిలింది. ఒకరినొకరు విడువలేక విడువలేక విడిచారు.

'దేవీ! వెంకటేశం బావా! నా తప్పులు క్షమించాలి'' అని పదేపదే దీనంగా వేడుకొన్న మోహన్ కనులుమూతల్లో, దేవీ వెంకటేశాల హృదయాలలో, కన్నీళ్ళు కారుతున్నాయి. దమయంతి అన్నగారు ఇచ్చిన చంద్రహారం చూసుకుంటూంది. ట్రయిను వెళ్ళిపోయింది.

"ప్రసాద్! ఈ పూట మీరు మాయింట్లో భోంచేసి వెళితేనేగాని వీలు లేదు'' అని వెంకటేశం చాలా పట్టుపట్టాడు.

"మీరు మాయింటికి రాకుండా, మమ్మల్ని మీ యింటికి రమ్మంటం న్యాయంగా ఉందా?'' అంటూ జవాబు చెప్పింది సరోజ్.

"చెల్లీ! అక్కగారిని గౌరవించే బాధ్యత నీది. పెద్దదానిని, మొదట మీరు మాయింటికి రండి, తరువాత మీ యింటికి మేము రాకపోతే అడగండి.''

"వట్టేనా?''

"వట్టే''

సరోజిని భర్తవంక చూచింది. భర్త అంగీకరించినట్లు సూచించాడు. ఆమె ఒప్పుకొంది.

* * *

రెండుకార్లూ ఇంటి ముందు నిలిచాయి. వెంకన్న బయటకు వచ్చాడు. వారిని చూచాడు. "ఇదేమిటా? బాబు. ఈ పిచ్చి వెంకటేశం మళ్ళీ ఈ ప్రసాద్ గాడ్ని లాక్కొచ్చా దేమిటి? మోహన్ విడిచి, తిరిగి వీడు దేవీ ప్రేమకు చెయి

నాచనుకదా? ఈ ప్రణయచక్రం ఇంకా ఎన్ని మార్గాల తిర గాలో కదా బాబు!" అనుకొంటూ వారి నాహ్వానించాడు. అరగంట గడిచింది.

పెళ్ళికొంపలాగ ఇల్లంతా కలకల్లాడుతూ ఉంది. వారి నిర్మల వదనాలు చూచిన వెంకన్న సంశయాలన్నీ, మబ్బులు విడి పోయినట్లు విడిపోయాయి. దేవి దగ్గరుండి వెంకన్నతో చక్కని పిండివంటలుచేయిస్తూఉంది. ఆనాడు దేవి వెంకన్నను చూచే పవిత్రపు చూపులలోని నిగూఢ భావం, వెంకన్న గ్రహించలేక పోయాడు. వెంకన్నా దేవిమాత్రం వంటిం టిలోఉన్నారు. దేవి గోధుంపిండి కలుపుతూఉంది, వెంకన్న కొబ్బరి పెరుగు పచ్చడి తాలింపు పెడుతున్నాడు.

"వెంకన్నా! నీవు వంటలవాడివేనా?"

"ఏం తల్లీ! అలా అంటున్నారు?"

"నీవు వంటల వాడివే అయితే, కూరల్లో అమృతం ఎలా పోయగలవు?"

"అమృతం కాదు తల్లీ! అనురాగం!"

"అదే అనురాగామృతం!

"అది కేవలం మీ సతీ పతుల ఆనంద భాగీరథిలో నుంచి తీసుకొన్నదే!"

"ఈమాటలన్నీ ఎక్కడ నేర్చుకున్నావ్ వెంకన్నా!"

"అమ్మా! చెప్పమంటారా?"

"అంతకంటేనా?"

"భగ్నజీవుల రక్తంలో కలం ముంచి, అనుభవజ్ఞుల హృదయ పుటపై వ్రాసిన విజ్ఞానశాస్త్రాలు చదివి నేర్చుకున్నా నమ్మా!"

"అవును. లేకపోతే సూటిగా హృదయంలోనికి చొచ్చుకు పోయే నీమాటలకు అంత కత్తిపోటుదనం ఉండదు."

"అమ్మా! నా వీ ఒకమాట లేనా? బొప్పగడ్డి నుంచి చెరుకరసం వస్తుందా తల్లీ!"

"అలా అనకు వెంకన్నా! రాళ్ళ హృదయాలు సింధి రాగాలు తీయించే శక్తి నీలో ఉంది."

"ఈ పేదవానిపై మీకు గల అభిమానం అలా అనిపిస్తుంది."

"డబ్బు లేకపోతే మానవులు పేదవారవరు వెంకన్నా! ధర్మబుద్ధి లేకపోతే పేదవారౌతారు."

"శభాష్! బాగా అన్నారు తల్లీ! బాగా అన్నారు. అదిగో! ఇటువంటి మాటలు మీవంటి అనుభవజ్ఞులవద్ద విని, నాలో జీర్ణించుకొని, నానిగా అప్పుడప్పుడు మరచి పోకుండా ఉంటానికి వాడుతూ ఉంటాను."

"సహృదయుల మనఃక్షేత్రాలలో అనుభవజ్ఞులు నూతనభావా లనే విత్తులు నాటతారు; కవిబ్రహ్మ అనురాగ వర్షం కురిపిస్తాడు; ప్రకృతితల్లి పంట పండిస్తుంది; రసపిపాసు లా పంటను అనుభవిస్తారు; భూమిని స్వర్గంగా చేస్తారు; ఆనంద ప్రపంచంలో పరవశు లౌతారు. ఏమంటావ్ వెంకన్నా!"

"బాగుందమ్మా! బాగుంది! అటువంటి మాటలే చెప్పండి. మీరు చెప్పినవన్నీ నేను ఆచరిస్తూ ఉంటాను."

అందుకనే, వెంకన్నా! నీవు గొప్పవాడవై ప్రపంచాన్ని నీ వెనక నడిపిస్తున్నావ్. మేము వెనకపడి నీ అడుగులంటి, వెన్నంటి వెన్నంటి వస్తూఉన్నాం. వెంకన్నా! ప్రపంచాన్ని తెలుసుకోవాలి గాని తెలుసుకున్నంత మాత్రాన్న లాభం లేదు. తెలుసుకొన్నది ఆచరణలో పెట్టాలి. ఆచరణ రహితమైన విజ్ఞానం అడవిగాసిన వెన్నెలే కదా"

"అవునమ్మా అవును. ఆచరణ అవసరం."

అంటుంటే సొంత ఇల్లులా సరోజిని వంటింటి లోకి గొతిపే్రమతో వచ్చింది."

"ఏమి టక్కయ్యా! విజ్ఞాన విషయా లన్నీ చర్చించి వేస్తున్నారు." అంటూ పీట లాగి కూర్చుంది.

"ఏముంది చెల్లీ! ఏమీ లేవు."

"అన్నీ వింటున్నాను."

"ఎలా?"

"ఈ తలుపు చాటునే నిలబడి."

"అమ్మ దొంగా!"

"ఇంకా అక్కడే నిలబడేదానను కాని మీ మాటలు వింటూ ఉంటే ఆనందం పట్టలేక లోపలికి వచ్చేశాను"

"బలే మంచి పిల్లవే"

"ఉండుండు. నన్నుకూడా నాలుగు కజ్జికాయలు చేయ నియ్"

"ఎందుకు చెల్లీ! నీ చేతులు కంది పోతాయ్"

"మందు వ్రాయటానికి మీ మగదిగా రున్నారు గదే."

అంతా పక్కుమని నవ్వేశారు.

"అమ్మా! ఒక్క కడుపున పుట్టిన అక్కా చెల్లెండ్ర లాగున్న మిమ్మల్ని చూస్తున్న మా ముసలి హృదయాలు సహితం గంతులు వేస్తూ ఉన్నాయి."

"అలాగే ఉండాలి."

"మీ రిద్దరు పూర్ణంకూరి ఇవ్వండి. నే నీ పూటలో కజ్జ కాయలు దోరగా వేగేటట్లు చేస్తాను."

"అక్కా! మన త్రిమూర్తుల భోజనం మా బావయ్యకు నచ్చుతుందా!"

"ఆయన కేం. గడ్డిపచ్చడిచేసి, కాస్త చింతపండు రవ్వ పిసికి తాలింపు వేసి "టమాటో చెట్నీ" అంటే, కాబోలనుకొని రాచ్చిప్పడు లాగుతారు."

"అయితే ఇంకేం"

"మీ బావ కేమీ పరవా లేదుగాని మా మరిదిగారికే మనవంటలు నచ్చుతాయో నచ్చవో!"

"ఛా! ఛా! ఆ భయ మేమీ అవసరం లే దక్కయ్యా! ఇంట్లో మిలిగిన కాయగూరలన్నీ తరిగి "ఇది రవ్వకూటు" అంటే అయివుండొచ్చు ననుకొని, వెండిగిన్నెడు గుటకాయ స్వాహా చేస్తారు."

"బాగుబాగు. అలాగైతే భీమ ఘటోత్కచుల్లాగున్న మీమీ ఆయనలకు ఎన్ని వేల కజ్జకాయలు చెయ్యాలో చెప్పండి." అని వెంకన్న అంటుంటే ఆ అక్కా చెల్లెండ్రిద్దరూ

కడుపు చేత్తో పట్టుకొని నవ్వుతున్నారు. వంటింట్లో నవ్వులు పేలిపోతుంటే మేడమీదుండలేక ఆ అన్నదమ్ములిద్దరూ వచ్చారు.

“ఓహో! అక్కయ్యా! బావగారొచ్చారు. ఆ అన్నం గుండిగ దింపమను.” అన్నది సరోజని.

“చెల్లీ! మీ బావయ్య అన్నంగుండిగ దింపుతారుగాని మా మరిది గారిని ఈ పీసెడు ఉల్లిపాయలూ తరగ మను.” అన్నది దేవి.

“తరగలేననా!” అంటూ ఉల్లిపాయల కత్తిపీట దగ్గరకు ప్రసాద్ వెళ్ళాడు.”

“ఓస్! అన్నం వార్చలేననా?” అంటూ వెంకటేశం అన్నంగుండిగ వద్దకు వెళ్ళాడు

“చాలు చాల్లే ఊరుకోండి ఎసరు కాలిమీద పడగలదు.” అంటూ సరోజిని బావగారి నాపింది.

‘చాలు చాల్లే, ఊరుకో. కళ్ళమ్మట నీళ్ళు రాగలవు’ అంటూ దేవి మరిదిగారైన ప్రసాద్ నాపింది.

“బాబుల్లారా! ఓ అమ్మల్లారా! అంతా కలసి నా వంట పాడుచేయక దయచేసి మేడమీదకు వెళ్ళి కాసేపు పాడుకోండి” అంటూ వెంకన్న అందరినీ గెంటివేశాడు. వారంతా అలా ఆనందంగా పాడుకుంటూ, ఆడుకుంటూ కాలంగడిపారు. ఒకరోజిక్కడ - మరోరోజక్కడ. ఆకాశంమీద చంద్రుని కప్పిన మేఘాలు విడిపోయాయి. చంద్రుడు తనకలువ ప్రియురాలితో కలసి చంద్రికాగీతాలు పాడుకుంటున్నాడు. పూల పాత్రలో వెన్నెల పాలుపడుతూఉంది-చంద్రునకు కలువకన్నె.

* * *

౯

రాత్రి పన్నెండు గంటలు కొట్టారు. వెంకటేశం భవనపు వీధిగుమ్మం తలుపులు తెరువబడ్డాయి. అంతవరకు మేలుకొన్న దేవి వెంకటేశములు ఆ చప్పుడు విన్నారు. వీధి వైపు చూచారు. ఎవరో వెళ్ళిపోతున్నారు.

"దేవి ! ఎవ రది ?"

"చూడండి."

ఇద్దరూ మేడమెట్లు దిగి ఆ వ్యక్తివైపు వెళ్లిపోయారు.

"ఎవరది ?"

"... ... ... ..."

"ఎవరు ? వెంకన్నా !"

"బాబయ్యా!"

"వెంకన్నా! నీవేనా ? ఏం ఈ అర్ధరాత్రి ఇలా వెళ్లిపోతున్నావ్" అంటూ అతని చేయి పట్టుకొని మేడమీదకు తీసుకువెళ్ళాడు. లైటులో అతని ముఖం చూచారు. ఎఱ్ఱగా చింతనిప్పుల్లా మెరిసిపోతున్న అతని కన్నులనుండి, కన్నీళ్ళు కారిపోవడంచూచి, ఆశ్చర్యపోయారు.

"వెంకన్నా! ఎందు కీ కన్నీళ్లు ?"

"హృదయభారం ఆపుకోలేక బాబయ్యా!"

"ఇలా ఎక్కడకు ?"

"వచ్చినచోటికే !"

"ఏమీ తీసుకోకుండా వెళుతున్నావే?"

"బాబయ్యా ! ఇక్కడకు వచ్చేటప్పుడు ఏమి తీసుకొచ్చామని, వెళ్ళేటప్పుడు మనతో తీసుకువెళతాము ?"

"వెంకన్నా ! నీ మాటలు నా కేమీ అర్థం కావడం లేదు. ఇలా ఎక్కడికి వెళుతున్నావు? నాతో చెప్పకూడదా వెంకన్నా నీ హృదయాన్ని"

"బాబయ్యా! నా పాపపు హృదయ గ్రంథాన్ని విప్పి చూపించి, మీ కనుల నీరు కార్చించ లేక, నేటివరకు నా బాధాశల్యాన్ని నా గొంతులోనే పెట్టి ఉంచాను. నేటి కా బాధ భరించ శక్యం కానిదయింది. అందుచేత ఈ ప్రపంచాన్నే విడచి, మరో ప్రపంచంలోకి ప్రయాణం చేయాలని బయలు దేరాను"

"వెంకన్నా ! ఎంత పని చేయబోయావ్" అంటూ వెంకటేశం కన్నుల నీరు నించాడు.

"వెంకన్నా! నీ జీవిత రహస్యం చెప్పకపోతే, ఈ క్షణం నుంచి నేను గంగ ముట్టను. ముట్టితే నా భర్తను నేను చంపిన మహాపాపానికి గురి అవుతాను" అంటూ గభీరంగా చెప్పింది దేవి.

"వెంకన్నా ! చెప్పకపోతే నా మీద వట్టే — చెప్పు చెప్పు" అంటూ రెండు చేతులూ పట్టుకొని తన ప్రక్కలో కన్న తండ్రిని కూర్చోపెట్టుకొన్నట్టు కూర్చోపెట్టుకున్నాడు. అతని హృదయవేదన ఏడ్చివేసి, శాంతచిత్తుడు కావాలనుకున్నాడు.

"బాబయ్యా ! బ్రహ్మాండమైన రహస్యం ఒకటి చెబుతున్నాను వినండి. మోహన్ నా కుమారుడే"

"ఆఁ! మోహన్ నీకుమారుడా ? అదెలా?" అంటూ ఇద్దరూ ఆతృతతో ప్రశ్నించారు.

"అంతేకాదు. మోహన్ తల్లిని, నా భార్యను, అన్యాయంగా చంపి పోలీసులనుంచి తప్పించుకు వచ్చిన హంతకుడను నేనే"

"అ దెలా? నీవు హంతకుడవా?"

"బాబయ్యా! నా భార్యా బాలు ఇల్లాలు. నేను బాగా చదువు కొన్నవాడినే. గాని వట్టి అనుమానిని. నా భార్యా తన బావగారితో చనువుగా ఉంటం చూచి చెప్పుకును మాటలు విని ఆమె "కులట" అని భావించి, మోహన్ పుట్టిన రెండు సంవత్సరాలకు చంపివేసి, ఇలా పారిపోయివచ్చాను. తరువాత నా భార్యా నిష్కల్మషహృదయం నా అన్నగారు మోహనుని పెంచడం విని కుళ్ళికుళ్ళి ఈనాటివరకూ ఏడుస్తున్నాను. నేను చావలేక ఇక్కడిలా బ్రతికిఉంటే, భగవంతుడా మోహనునే నా వద్దకు పంపాడు. వానితో ఈ రహస్యం చెప్పలేక నాలో దాచలేక కుమిలి పోయాను. ఇది నేటికి భరించరానిదై పోతే ప్రాణాలు చాలిద్దామనుకున్నాను."

"ఎంత విచిత్రంగా ఉన్నది నీ జీవితం." అన్నారు వారు.

"మోహన్ తాగుబోతులతో మిమ్మల్ని చంపాలని బాదం చెట్టువద్ద మాట్లాడుకుంటం తోటలో పుల్లల కోసం నికి వెళ్ళిన నేను విన్నాను. వాడిని మందలించా లంటే నాకు వాడు కన్నబడలేదు. అంచేత మీకు ప్రమాదంరాకుండా మీవద్దే ఉన్నాను. భగవంతుడు వానిని పాపిని చేయకుండా, మీప్రాణాలు తీయకుండా రక్షించాడు. ఇంతకూ తండ్రిని బోలేకదా

బిడ్డ లుండేది. హంతకుని కుమారునికి హంతకుని భావా లుండవ్వూ?'' అంటుంటే వారు రెండు నిట్టూర్పులు విడిచారు.

"వెంకన్నా! పద్మభూ! మీ ఇద్దరికూ నూరో రహస్యం చెబుతున్నాను వినండి.'' అంటూ దేవి భర్తవైపు తిరిగి... "నేను మీకు ఉత్తరాలు చూపి, నా చిన్ననాటి ప్రియునివల్ల నాశనం అయ్యాననన్నానే. అతడే ఈ మోహన్''అనేసరికి వారు "ఆ'' అంటూ ఆశ్చర్యపోయారు.

"నే నతని కోరిక నెరవేర్చ లేదనే ఈ కక్ష పూనాడు'' అంటే "అలాగా''అంటూ వాళ్ళిద్దరూ ఆశ్చర్యపోయారు'' పది నిముషాలు గడిచాయి.

"బాబయ్యా! కన్నబిడ్డ ముఖం చూడటానికే ప్రేప్తకు రాలేదు. ఇంక నే నే కాశీ పోయో శాంతిగా బ్రతకాలని ఉన్నది. నా కోరిక తీర్చాలి''అని వెంకన్న ఏడిస్తే అతనిని కౌగిలించుకొని "వెంకన్నా! నీవు నా కుమారుడవు, తండ్రి తరువాత తండ్రి అంత వాడివి. ఈ ఇల్లంతా నీదే. నీవే రేపటి నుంచి చూచుకోవాలి. ఇవిగో ఇనపపెట్టె తాళాలు''అంటూ ఇనపపెట్టె తాళా లిచ్చాడు.

'ఓహో! వెంకన్న బాబాయిగారా! మీరు మీ అల్లుని విడిచి వెళ్ళకూడదు సుమండీ!'' అంటే అంతా నవ్వుకున్నారు. వారి పట్టుమీద అత పండిపోయాడు. కాశీ వెళ్లాలనుకున్న వెంకన్నకు ఇనపపెట్టె తాళా లిచ్చి బంధించాడు వెంకటేశం. ఇప్పుడు వెంకన్నే వారింటి యజమాని. సరోజినీ ప్రసాదులు వెళ్ళడానికి,

పిల్లు వారింటికీ వెళుతూ నిత్యకళ్యాణం పచ్చతోరణంగా ఉన్నారు. సన్మిత్రులవల్ల చెడునుంచి మంచికి ప్రవహించిన మానవజీవితస్రవంతులను చూస్తూ ఇంక ఈ నవల ముగిస్తాం.

మళ్ళీ మరొక విచిత్ర సంఘటన తీసుకొని, కాసేపు న్యాయాన్యాయాలు ముచ్చటించుకుందాం.

ఏమంటారు ?

ఏదో ఇలా నా హృదయవేదన వెళ్ళబుచ్చుతూంటాను. మీరు సహృదయులై వింటూవుండాలి, మరచిపోకండే ?

మళ్ళీ
త్వరలో కలుసుకోవాలనుకొని
మీ
చంద్రిక.



# నా ఆశయాలు

కాలాన్ని బట్టి కవికలం కదను దొక్కుతుంది

నా కలం పదును పెట్టుకోనేది కాగితంమీదకాదు; భావుకహృదయం మీద; నే పూరించే శంఖం శివుని గర్భగుడిలో కాదు; భగ్నజీవితవిషాదగర్భంలో. నేనెత్తే కవితాపతాకం కూడలిలో కాదు; కూలిపోయిన కూలీల పాకల్లో. నే నిచ్చే హారతి సరస్వతికి కాదు; పరిదగ్ధ దరిద్ర బానిస భావానికి.

నా ప్రధానాశయాలు:

జాతికుల మతభేదాలు రూపుమాపడం,

సర్వమత సమత్వ నిరూపణ చేయడం,

అభాగ్యులైన కూలీల, ఆకలి మంటకు కారణం శోధించి, మార్గం చూపడం

స్త్రీ పురుషుల సమాన హక్కుల నుద్ఘాటించడం,

ఇవికాక___

నా కంటె అంధులైన నా ఆంధ్రసోదరులను ఆరనివిజ్ఞాన జ్యోతులచే చీకటి నుండి వెలుగునకు; అజ్ఞానంనుండి సుజ్ఞానానికి, భిన్నత్వం నుండి అభిన్నత్వానికి మార్గం చూపడం.

శాంతి స్వతంత్రాభ్యుదయాలకై పాటుపడడం,

సంఘంలో పాతుకుపోయిన స్వార్థం, ద్రోహం, ద్వేషం, రోషం, మోసం మొదలైన అంటువ్యాధులను హతమార్చడం.

ఆరిపోని అనురాగ నూతన కవితా దీపికలు ఆంధ్ర హృదయ దేవాలయాల్లో వెలిగించి ఆనంద గీతాల నాలాపించడం___

ఇవి నా ముఖ్యాశయాలు.

నా ఆంధ్ర సోదరులు నన్నన్యథా తలచక హృదయం గ్రహించి సహృదయులై ఆదరిస్తారని

ఆశించే

మీ అనురాగాభిలాషి,

అభ్యుదయ కవితోపాసి,

జంపన చంద్రశేఖర్

అన్నామలై విశ్వవిద్యాలయం

దీపావళి

---

